శ్రీ

# త్రివర్గము.






ఇది

ద్రావిడమున

వళ్లువమూర్తి యనువారిచే

వక్కాణింపఁబడియుండెడు నీతిగ్రంథమునకు

గూడలూరు - చొక్కలింగం

- నరసింహులునాయనిచేఁ

జేయఁబడిన భాషాంతరము.



పచ్చయప్పమొదలారి ధర్మపరిపాలకుల

ప్రాపకముఁగాని
పి - టి - లీ - చెంగల్వరాయ నాయకులుగారి
శ్రేయంబునఁ
ప్రకటింపఁబడియె.



MADRAS:
PRINTED AT THE P. T. LEE. CHENGALROYA NAICKER'S ORPHANAGE PRESS.

1892.



## OPINION.

I have been requested by the author of this Telugu Translation of the Kural to state what I think of his performance. So far as I am able to

judge, the translation is fairly accurate; and when it is borne in mind that a work like the Kural written in a pithy, concise and aphoristic style is very hard to translate, it may be easily imagined what difficulties the translator has had to overcome. Regarding the value of the Kural as a treatise on moral and political philosophy, I need say nothing more than that it is the best thing of its kind in Tamil literature, and that it is a matter for regret that it has so long remained untranslated into the other Dravidian languages. I rejoice to find that this deficiency is about to be supplied so far as the Telugu language is concerned. The following extracts will prove the high estimation in which the Kural is held by competent and distinguished European scholars.

P. RANGANADAM, M. A.

The work itself, the Cural of Tiruvalluvar, is held in the highest veneration by the Tamil people. The writer of it is deemed an incarnation of wisdom. It is called the first of works, from which, whether for thought or language there is no appeal......The Cural has a strong claim upon our attention, as a part of the literature of the country and as a work of intrinsic excellence.

REV. W. H. DREW

# పీ ఠి క.



శ్రీమత్సాంబమూర్తి తొల్లి సకల సురాసుర మునిజన నికర పరివృతుండయి తాండవంబు సల్పి నపుడు తనచేతి డమరుక ధ్వానమునందు-అకారాద్యక్షర లక్షణ సూత్రముల నాకర్ణింపఁ జేయ నయ్యది గొని పాణిని ప్రముఖులు సంస్కృత లక్షణ గ్రంథముల సంపతిల్లఁజేసిరి. అగస్త్య మహర్షి ద్రావిడ భాష కాదిమూఁడై వర్ణ శబ్దార్థ* చ్ఛందో లంకరణములను పంచ పరిచ్ఛేదములు గల-అగస్త్య మనంబడు నాది లక్షణ గ్రంథము నాకల్పించెను. అనంతరంబతని శిష్యుండైన తృణ ధూమాగ్ని ఋషిచే వేఱొక్క- లక్షణ గ్రంథము విధింపఁబడియె నయ్యదియే యిప్పుడు పంచ లక్షణ సహితముగఁబ్రవర్తిలు చుండునది. దీనింగొని పిదపఁగొందఱు గొందఱు గొన్ని కొన్ని భాగంబులు గల యనేక లక్షణ గ్రంథములు సంగ్రహములుగ
సంస్కరించి
బయలు వఱిచిరి. ఇత్యాది లక్షణ గ్రంథంబులకు
లక్ష్యస్థానము
లనంబడు నటు లేర్పడిన లక్ష్య గ్రంథంబులలో
లుత్తమయి

పోయిన యనేకములు పోcగా నిలిచి వ్యవహ
రింపcబడునవి యలవి
కానివి. ఇట్టి ద్రవిడ భాషా సముద్రంబునకు సముద్రంబును
గన్యా కుబ్జంబును సహ్యా పర్వ తంబును వేంకటా ద్రియుc
గ్రమంబుగcబూర్వ దక్షిణ పశ్చి మోత్తర తీరంబులై తోరంబగు

* అందుcగల యర్థ పరిచ్ఛేద లక్షణ విషయ విశేషంబులు సంస్కృతంబు
నందుcగాని యితర భాష లందుcగాని లేనివిగా నున్నవి యవి యీ త్రివర్గ
నామక గ్రంథమందుcజెప్పంబడి యుండు 3 - వది యైన కామ కాండంబునం
గల విషయంబులచేcగొంత కొంత విశదమగును.



చుండును. ఈచతురవధి మధ్య ప్రదేశంబు
చతురవనీశ దేశ
భాగములుగ భాగింపcబడి యందు మొదటిది
తుండీర మండల
మను* పేరుగాంచి ద్రావిడమునcదొండ మండల
మ నిప్రశస్త
మయి యుండును - ఇదియే కాంచీ మండలము

౨ - వది - చేర

దేశము - 3 - వది - చోళ దేశము†

- ౪ - వది - పాండ్య దేశము.

ఈ దేశంబులు నాల్గింటిలో పాండ్య దేశము

ద్రావిడమునకుఁ

దావరమైన ప్రధాన స్థానముగాఁబ్రసిద్ధి వహించి దక్షిణ మధుర తనకు ముఖ్య పట్టణమై యుండునటుల మొనసి యుండెను. అందు శ్రీమత్సాంబమూర్తి వలన శాసింపఁబడున్నదై పాండ్య క్ష్మాపాల పాలనంబు గలదియై తపోజ్ఞాననిధానులైన పండిత ప్రధానులచే మండితంబైనదై విద్వత్సంఘంబాకండు విలసిల్లుచు వచ్చి యిప్పటికి యించు మించు వేయేండ్లక్రింద నక్కీరఁ

డను నామముగల పండితప్రధానుని

బ్రధానునిగాఁబడసి నలువది

తొమ్మిదిమందిఁగలది యనఁగొలఁదిఁగొని

నలు మొగములం దెలి

యనయి చెలఁగియుండెను.

ఆకాలంబునఁదుండీర మండలంబగు

కాంచీ మండలంబున

సముద్ర తీరంబున నిప్పటి యాంగ్లేయ

రాజ్యంబునకు రాజ

ధానియై యుండెడు చెన్నపురికి దక్షిణంబున రెండు

క్రోశంబుల

దూరంబున వామదేవ వాసుదేవుల పావనీయమగు

కోవెలలచే

తీవిఁగని పుణ్య క్షేత్రంబయి గణ్యంబొందిన

మైలమను నూర

---

* ఈతుండీర మండలము తొల్లి ఆదండ చక్రవర్తి యను నవనీశ్వరుచేఁ బ్రోది చెందఁబడు చుండి యందు వలనఁదొండ మండలమని ప్రశస్తమయ్యె ననుట ద్రావిడంబునఁ బ్రశస్తము.

†. వీనిలోఁ దుండీరమండలంబునకును చేర-చోళదేశంబులకునుమధ్యఁగొంత భూమిచేఁది నాడనంబడి సామంత రాజ రాజ్యముగా సాగుచుండెను.



వల్లువరను* పేరుగల యొక్క వర్ణనీయ పుణ్య

శీలుఁడు వర్ధిలి యుండ నయ్యెను. అతనితల్లి ఆదియను
పేరుగలామె ఆదిమ శక్త్యంశ సంపన్నురాలు - తండ్రి
భగవుఁడను పేరుగలాతఁడు భగవదంశ సంపన్నుఁడు.
ఆభగవన్నామ ధేయుఁడు బ్రహ్మచారిగా నుండి
యౌవన ప్రాప్తుండై నపుడు పారాశరిత్వముఁ గోరి
ప్రవర్తింపుచు విధికృతంబున తటస్థించిన వివాహ
మంగళమునకు విరాళిఁగొని వైవాహికుండయి
వధువుతో బొమ్మలు
పుట్టునేని పుట్టిన పట్టులనే పెట్టి దిట్టతనంబుతో వెనుబట్టి వచ్చు
నటుల కట్టడ చేయ దిట్టముఁజేసి సంపర్కమునకు సమ్మతిఁ
గొన్నవాఁడయ్యెను. తదనంతరంబున నాదంపతులు
వానప్రస్థాశ్రమంబు వహియించి తీర్థయాత్రాభి
లాషులై దేశాటనంబు సలుపుచు సత్ప్రభువులు
గాంచు సప్త సంతానములంబోలు నట్లు సప్త
సంతానములంగాంచిరి. కాంచినపుడెల్లనుగన్నామె
కొన్నాతని వెన్నాడ
వలయునుగదా ? యీచిన్ని కూనల నెట్టుల మిన్నక

వదలిపోవ నగుననియెంచి యుల్లము తల్లడించి వెల్లిఁగొన నేడ్వఁగని యాపాడమిన బుడుత లొండొండును దల్లి దండ్రుల తపఃఫల వాసనా విశేషంబు వల్లను దమపూర్వ కృత సంచిత పుణ్యాతిశయము వల్లను నన్యాతిశయిత జ్ఞానోదయము నంది "సృష్టించి నతఁడు రక్షింపఁగలఁడు" అను భావంబు గల యీ

---

* వల్లువరు - పూజ్యార్థ బహువచనము - ఈశబ్దము - ఒక్క నీచకులుఁడు- చాటించువాఁడు - పురోహితుఁడు - భవిష్యత్కార్యము బలుకు వాఁడు - అను నర్థములు గలది - మఱియు దానార్థక ధాతుజ ప్రాతి పదికమయి దాతయను నర్థము నిచ్చునది - వీనిచే నితఁడు నీచకులములో నెగడి నాతఁడని నిశ్చయింపఁబడినది కలదు - ప్రత్యుపకార మెదురు చూడని బలు మొగులుంబలెఁ బ్రపంచమునకు నీతి గ్రంథము బ్రతిపాదించి నిబ్బరికించి నందున నాపేరితని కారోపింపఁబడెనని యనేక పండితోత్తముల యభిప్రాయము.



దిగువ వచ్చు పద్యములలో వరుస క్రమముగ
నొక్కొక్క పద్యము

నొక్కొక్క నిసువును వక్కాణింప నాలకించి యామాత జ్ఞానోపేతయు ధైర్య ప్రతీతయునై మానినీ స్వభావముచే మానఁగూడక కూడిన తనమన శ్చాంచల్యము మాని మగనితోఁదగిలి నడుచు చుండెను.

## ఆపద్యములు వచ్చు తెలుఁగు.

౧. క. నాదు నొసట నిట్టగు నని
యాదిని వ్రాసిన శివుండు
న్గణఁగి పాలిసెనో
కాదనక కలవు గల్గిన
నా దేవున కగును భార మంజకు మమ్మా.

౨. సామజములు మొదలుగఁ జీలు
చీమలవలకయిన సకల జీవులకు మదిన్
బ్రేమఁగొని ప్రోచు నీశ్వరుఁ
డేమలు నే యల్పుఁడే మహేశుండంబా.

౩. కరువున గ్రుడ్డునకును బ్ర
స్తరమున మండూకమునకుఁదవిలి కుడుపు నీ
శ్వరుఁడొడలొందినఁగుడుపిడి
పరిపోషింపండె చింత పడకుము తల్లీ.

౪. మావి నుసు అవ్వ కుడువఁగ
జీవించును చేశి నుసులు జీవించుట యో

హా వింత వగవ నేటికి
నీవీశ్వరు నిత్య మహిమ
నెఱుఁగుము జననీ. పీఠిక.

౫. చూపు చొరని కాననమున
నా పాషాణమునఁగప్ప కరసి కుడుపువాఁ
డోపిక నాకును బత్తెముఁ
జేపడఁగొల్చుఁబశు పతికిఁ జెయ్యోది యగునా.

౬. జనని గర్భమునఁగుడుపిడి
పెనిచిన యతఁడింక నన్నుఁబెనుపఁగ
లేఁడో
ఫణిఁదాల్చు విభుఁడు పితృవన
ముననిల్చి నటించు విభుఁడు

ముఖ్యుండతఁడే.

౭. పయసులు మనుప నొకజే
జేయుండునా లేఁడా నేనుఁజేరిక కాదో
యాయుసులుల నొకఁడుగన
వ్వాయసుఁగాఁగలవి చనక వగ పేమిటికిఁ.

అని యిటులఁబాడి యవ్వ తగులునాడి యాదిదేవు కృపమూఁడి యకట డకటడఁబడి యున్న యాయా పాపలు గన్నవారిచేఁ గైకొనంబడి కొన్నవారు గూరిమిఁగొని పెనుపఁబెరిగి వరుసగా

అవ్వ*

ఉప్ప - అధికముఁడు - ఊఱవ - కపిలుఁడు - వల్లి - వళ్లువరు అను నామంబులంబడసి యనేకంబులగు నతిశయంబుల నాచరించి యుత్కృష్టోద్భవులనునట్టు లుల్లసిల్లిరి.

---

* వారిలో మొదటి చూలున నుద యించిన అవ్వ యను నామె పెండిలి

యొల్లక దండితనంబు వెలసి చండ ప్రచండంబులుగ చాటు ధారలను బాడి
పెక్కులగు నద్భుతంబుల నక్కడక్కడఁగనుపఱిచి యెల్లవారలకుం జెల్లముగఁ దెలియు తెల్లని చల్లని పలుకులఁ గొల్ల కొల్లలుగఁ గూర్చి యనేక నీతి గ్రంథములు నిర్మించి తత్త్వజ్ఞాన ప్రధానరై వర్తిలి యుండెను.



వారిలోఁగడపటి చూలున నవతరించిన ఘనుండే వల్లువరను నతండు.
అతండా మహాస్థలంబగు మైలమునఁ బెద్దయును ముద్దుగ వృద్ధిఁబొంది పెద్దల కుద్దిచెందిన సుద్దులొంది విద్దెలలో వాగీశ్వరుండన వాక్రువ్వఁబడి యందఱు నభినందింపఁగ్రందుకొని యుండి వాసుకియను పేరుగల ధర్మ శీలయగు తరుణి నొకర్తెను దనకు ధర్మ పత్నిగాఁగొని గృహస్థుఁడయి నేఁత నేసి జీవించుట పాతకంబుఁబడయ నీని జీవనంబని చింతించి యా యూర నుండిన యొకట సాంయాత్రికుండును సత్కర్మ శీలుండునైన యేలేల సింగఁడను బేహారి ప్రభువు నొద్ద నూలు గొని

వచ్చి నేసి యిచ్చి
యొడ నావల్లువ

కూలిఁదెచ్చి కాలము గడపుచుండెను. అట్టి
వాగీశ్వరు సచ్చరిత్ర సంపదలఁ జక్కఁగా
నెఱింగి నతఁడయి యాసాంయాత్రి కుండా
మహనీయ ప్రభా
వునకు మాననీయ పరిపక్వ శిష్యుండై శుశ్రూష
దేశము వడసి తనకూర్చిన ధనమునా గురువునకు

సల్పి తత్త్వోప
గురుదక్షిణగా
సమర్పింప నాతనిం జూచి యా భండా రంబును
గఱఁగించి బంగరు బండగ్గాఁబోయించి దానిపై
యేలేల సింగఁడని వ్రా
యించి పారావారంబునఁబాఱ వేయింపు
మని నియమింప నా శిష్యుండాలాగే యాచరించెను.
అనంతరం బా బండనొక్క గండుచేఁప తిండిగాఁగొని
మ్రింగి కాల వశంబున జాలరుల జాలంబునందగిలి

యేలేల సింగని యింటికి వంటకుండేంబడ్డచో
దాని కడుపున నుండి పచ్చని పాంచి పట్టిన బండవలె నొండు
కనుబడ నయ్యది బండ జాయియ యని తలంపంబడి యొండు
మూలంబడవేయంబడెను. అంత నాజాతిపై నుండిన పాంత
పాంచి యెండి పెచ్చులెత్తి విచ్చుచు వచ్చి బంగరు పసుపు రంగు
తొంగలింపందొడంగంగని సింగతని జనము లాతనితో సంగతి
నెచ్చరింపవచ్చి చూచి యేలేల సింగని యొడమె యెందుంబోయిన



వచ్చునని ముచ్చటలువడ నందఱుంబల్కెదు సందడి పలుకుల
నాలకించెను. మఱియు నొకర్ నాండొకర్ పుణ్యశీలోత్తముం
డావల్లువ వాగీశ్వరుని జేరి గృహస్థ ధర్మము గ్రహింపందగ్గదో
సన్యాస ధర్మము సాధింపందగ్గదో యని యడుగ బదులేదియుం
బలర్క యుండి తన నాతి నూతిలో నీరు దివియుటం గాంచి

కొంత దిగిచి యెత్తుచుండంగాం బిలువ నా చెలువ
దాని నట్టె
వదలిపెట్టి కట్టెదుట వచ్చి నిలిచెను - అప్పుడతండు
పట్ట పగటి
వెల్తురు పరిఢవిల్లు నొకర్ పట్టున నేయుచుండి

నేఁత నాఁడె
నేలఁబడఁగా దీని నెత్త దీపంబు వలయుఁదెమ్మ యన నాపువ్వుం
బోఁడి చివ్వునంబోయి దివ్వెందెచ్చెను - అంతకుపై చలిదిబువ్వఁ
దెచ్చి యిడమని సాపడఁదొడంగి వేఁడిగా నున్నదని యాఁడనా
చేడియ విసనకఱ్ఱ యెత్తి విసరుచుండెను. ఇత్యాది కృత్యములఁ
బొడగని యాపుణ్య శీలుఁడిట్టి యిల్లాలు దొరకు నేని యిలు
తేఁడు తనమే యిమ్మగుననియు లేనిచో సన్యసించుటయే సత్తగు
ననియుఁదలఁచుక తరలెను. కడపట నాకాంత తనకంత్యకాల
మాసన్నంబయి నపుడు మగనిఁగని యన్న మిడఁదొడంగిన యాది

దినము నుండి సన్న సూదియుఁజిన్న గిన్నియ
నీరుఁబంచిన పగిది
నుంచుచు వచ్చితి దాని యుపయోగము గాన
నైతినన దిగువఁ
జిందిన మెతుకు లెత్తి కడిగి కుడువనని నుడువ
విని యాచాన
విగత ప్రాణయయ్యె నప్పుడతండు,
తే. గీ. చవిగ వండెడు దాన నేస్తంబుగల్గు

దాన బడినుడి తప్పని దాన యడుగు

లొత్తి వెనుదూఁగి మునులేచి యుండు
ముగుద
పోయితివె నాదు కనులేమి
రేయిఁదూఁగు.

అని యడలెను.



అనంతరం బ్రహ్మహోత్ర్ముఁడు దన కవసానకాల
మాగమించి
నపుడు శిష్యుండైన సింగ ప్రభుఁగని కాకులు
మొదలైన వాని
యాఁకటికిఁదన తనువు వినియోగ మగుకొఱకు
బహిస్థలమం
దెం దేనియుఁబడ వేసి పోవలయు నని భద్రము
గొనఁబలికి బ్రహ్మ
నిష్ఠఁ గైకొని పరిపూర్ణ దశఁబడసెను.

ఇట్టి చారిత్రుండగు నాశిష్ట
కార సహితము నఖిల దోష

వరేణ్యుఁడీ గ్రంథమును - అలం
రహితమునగు శబ్దార్థ రూప

శరీరంబును - అల్పాక్షరము అసందిగ్ధము మొదలగు సూత్ర లక్షణో పేతంబును - శోభిలుచుండు పద్యభండారంబుఁబడసి యుండఁబ్రకల్పించి - కుఱుచయగు రెండడుగులుగల పద్యవిశేష మనియుఁగుఱుచది యనియు నర్థమునివ్వఁగల "కుఱళ్" అను నొక్క- పలుకును దీనికిఁ బేరుగాఁ*బలికి-దీనియందు విరచింపఁ బడ్డ విషయములగు త్రివర్గ మనఁబడు ధర్మార్థ కామములు మూఁటిని మూఁడు కాండములుగ నేర్పఱిచి-వానిలో మొదటి దగు ధర్మ కాండమున మొదట నవతారికఁజెప్ప నారంభించి యఖిల మతస్థులకు నాక్షేపము లేకుండునటులు భగవద్ధ్యానా ధ్యాయ† మొండుఁబలికి యయ్యది యా యవతారికయం దాదిని యుండఁబాడు కొల్పెను.

---

* ఆపేరి వలన నీగ్రంథము కుఱుచ రెండడుగుల పద్య విశేషములది యనియుఁగుఱుచది యనియు నెంచునటుల రెండర్థముల ధ్వనింపఁజేయు చున్నది.

† అందు మొదటిపద్యమునఁజెప్పిన భగవచ్ఛబ్దమునకు మొదట ఆదియను

శబ్దముఁజేర్చి - అది భగవంతుఁడని చెప్పెను. ఇతనితల్లి ఆదియను నామెయుఁ దండ్రి భగవుఁడను నాతఁడుం గావున దైవికము చేతనో యాతని కుండిన దైవాంశ జ్ఞానము చేతనో యితనితల్లి దండ్రుల పేరులుంగూడ దాని యందు తారసిల్లఁ జెప్పఁబడెనని తలఁపవలసి యున్నది.



భగవంతుని యాజ్ఞచే లోకమున కావశ్యకమైన ధర్మార్థ కామములు జరగ హేతువయి పరఁగునది వృష్టి కావున వృష్టి విభవమును భగవద్ధ్యానమునకుఁబ్రకటఁబెట్టెను. వృష్టియుండు నెడనుండు లోకంబునకు వలసిన ధర్మార్థ కామంబులను దెల్పువారు పరివ్రాట్టులు గావున పరివ్రాట్టుల మహిమమును వృష్టి విభవ మునకు వెనుకవెలయ నిచ్చెను. పరివ్రాట్టులచేఁ బలుకఁబడుమూఁటిలోనర్థకామములంబోలకధర్మము - ఇహము - పరము - మోక్షము - అను మూఁటి నిచ్చుట వలన ధర్మప్రభావ మును బరివ్రాట్టుల మహిమకుఁబదంపడి పరఁగించెను. ఇటుల నవతారికను ముగించి ప్రవృత్తి ధర్మ ప్రకరణ మారంభించి

ధర్మముఁదనరించు వాఁడు గృహస్థుఁడు గావున గార్హస్థ్యమును ధర్మ ప్రభావమునకుఁదర్వాతఁజేర్చెను. ఈలాగున నధ్యాయముల నొండు ప్రకా నొండుగాఁబొందు పఱుచుచుఁబోయి ధర్మ కాండము ముగించి - ధర్మము జరగుట కావశ్యకంబైన యర్థముఁజెప్పఁదొడంగి యర్థకాండ మారంభించి దాని యందును - అర్థ ప్రయోజనము కామముండంబట్టి కాఁగలది కావున నావల కామముఁజెప్పఁదొడంగి కామ కాండ మారంభించి దాని యందును - అధ్యాయము లొకటి కొకటి విషయ సంబంధ ములచే విలసిల్లియుండునటులు క్రమపఱిచెను.

ఇట్లిదగు నీగ్రంథమును పాండ్యదేశమందలి

పండితగోష్ఠిలో ప్రసంగించి ప్రసిద్ధి పఱుపఁదలంచి ప్రయాణమయి దారిలో నుండి తత్త్వజ్ఞాన ప్రసిద్ధిఁగన్న యుత్తమ సిద్ధుండగు విద్యా సమృద్ధుఁడొకాఁడును దోఁబుట్టిన అవ్వయను నామెయుఁ దోఁబట్టి రాఁగాఁబోయి యొకా బండఱాతిపయి నిలుచుండిన సంఘాధ్యక్షుని మొదట సందర్శించిరి. అప్పుడతఁడు - ఎవ్వరు!

పమిపనిగ వచ్చితిరి? అని యడుగ గ్రంథమొండు దెచ్చితిమని తెచ్చిన దానిపేరు దెలిపిరి. ఆపేరు కుఱుచది యను నర్థము గొననిచ్చుట నూహించి యందుఁజెప్పియుండు విషయమేది యనియడుగ నంతయునని వింత పడఁబలికిరి -

అందున కతండు

అంతయునుఁగుఱుచ దానిలోనివర్యోనా యని

చయ్యన నవ్వి

తాను నిలుచుండు ఱాయి దానిలోనున్నదా యని

కుచోద్యముగ

విచారింప గ్రంథకర్త యున్నదని తిన్నఁగఁబలికి,

"వృథగ దినములు వడక మేలిడ నదొకని
మనికి దినముల పథము వోమాన్చు

ఱాయి".

అను - ౩౮ - వ - పద్యమునెత్తి చెప్పెను. ఆపద్యము విని మాటాడుటకు నోరాడక యుండి గోష్ఠికిఁగొని వచ్చు నటులు సెలవిచ్చి పనిచి యందఱకు నీవృత్తాంత

మందఁజేసి తొందర
పడుచు సందడి వెలసి వాడుకవలెఁబోడిమి
చెలంగ పాండ్య
మహారాజు పరిషదధ్యక్షుతఁగొని పరిఢవిల్లుచుండ
నాగరులు
ప్రోగులయి యేగుదెంచి మూఁగియుండ భోగీంద్రుని
యవతార
పిండములో యనఁబొగడొందిన యాపండిత సింహములు
గండుమిగిలి పిండుగట్టి యుండునెడ నచ్చటికింబోయి వచ్చిన
కారణ మెచ్చరిఁచిరి. అప్పుడు నక్కీర నామధేయ సంఘా
ధ్యక్షుఁడు మీరలేయూరని యడుఁగ, వళ్లువరు -

క. ఏయూరంటిరి యుండిన
యాయూరి చరిత్ర మెఱుఁగ
రామీరు వినుం డాయది ముప్పాదులుఁబా
డైయొక పాడై లయించు నవలను బాడై.

అని పద్యముగాబదులు వల్కెను.



ఆపద్యమువిని యచ్చెరువుఁగొని యీతఁడ

సదృశకవిత్వాతి
శయుఁడు పరమజ్ఞాన ప్రభావుఁడు తపోబలధన్యుఁడని నిదానించి
యావల నెయ్యదియుననుట కియ్యకొనక గ్రంథపరిశోధన కుపక్ర
మి ం చియామూలాగ్రమాలకిం చి
యామోది ం చియా గ్రంథాతిశ
యాదులన్నియు నెన్నికకెక్కి చెన్నుఁబడయ
నోకొక్కరు నొక్కొక్క చాటుధార * వక్కాణించి
యతనినతనిగ్రంథంబు ననే
కాభిధానం బుల ం బొగడియవఘళింపజేసిరి.
మఱియునచ్చటవచ్చి యుండినసచ్చరితు
లందఱునిచ్చనలరి యాచంద్రార్క మీగ్రంథ
మవనీతలంబున నభివృద్ధినందుఁగాక యని
యాశీర్వదించి ఘో షించి భూషించిరి †
అప్పుడాసభ్యులచేఁ బొగడఁబడ్డవియగు.

# గ్రంథకర్త్రాభిధానములు

# వళ్లువమూర్తి.

శివస్వరూపి.

దైవతము.

ఆదిమకవి.

దివ్యమనీషి.

చతుర్ముఖుఁడు.

మాతానుభంగి.

సద్వాగ్విజ్ఞుఁడు.

మహాప్రాజ్ఞుఁడు.

# గ్రంథాభిధానములు.

గీతార్థము.‡

త్రివర్గతంత్రము.

ఉత్తరవేదము.

దివ్యతంత్రము.

పల్లవమూర్తి.

# సత్యోక్తి.

# శ్రుత్యర్థము.

# ద్రవిడవేదము.

# సమరసశ్రుతి.

---

* అచాటుధారలు ౫౨. అవి వట్లువమూల యని

† అప్పుడిట్టి కవిత్వాతిశయు లెచ్చొటెచ్చొటో

వాడుకొనఁబడుచున్నది.

యెందఱెందఱో యుం

దురు శాబోలు నీసంఘమువారు మనదుమాత్రమే యని

మొనసియుండినది పనికి రానిదనిపలుకనయినందున నదిమొద

లాసంఘము తుదిఁగొననయె

‡ గీతార్థంబనునది మూలగ్రంథ నామంబగు (కుజల్) ..
నుండఁబలుక నయ్యెను.



ఈగ్రంథంబునకుఁబది మంది వ్యాఖ్యాతలు
బయలువడిరి వారిలో
(సైంధవోపరిసాధువు) * అను పేరిచే సన్నుతిఁ
గన్నతఁడు వ్రాసిన యొక్క వ్యాఖ్యానమే మిక్కిలి ప్రసిద్ధమైనదై లక్ష్య
లక్షణ వేత్తలు లాలింపఁదగ్గదై వాలాయము గలదిగ వ్యవహ
రింపఁబడుచున్నది. ఇట్టిసవిస్తర వ్యాఖ్యానముతో
సంయోగముగన్న యీమహాగ్రంథము నీహిందూ
దేశమున కత్యంత
దూర ప్రాంతమగు పాశ్చాత్య భూప్రదేశమందును
మందును వ్యాపించియుండు నాంగ్లేయాది యనేక

ద్వీపాంతర
రాజ్యముల
వారు భాషాంతరములు సేసికొని

ప్రయోజనముఁ బడయుచున్నారు. ఇరుగు పొరుగు వారగు నీయాంధ్రదేశస్థులు దీని యతిశయముఁగానని వారైరి-ఆంధ్రదేశస్థుల యాంధ్ర భాషా భ్యాసమునకు ద్రావిడ భాషాసహాయము గావలసినది లేదు గనుక వారలకిది దూరముగ నుండఁగారణముండెను.

నేను నాజన్మభూమి సంబంధముచే ద్రావిడభాషాభ్యాసము గొంతఁగావించి యుండఁగలిగెను గాన సంస్కృత గ్రంథ ములతో సదృశమైనదిగను దాను లేనిచో లోకమే లేదనఁ దగిన త్రివర్గమును మాత్రమే దీపింపఁజేయునదిగను దేజరిల్లెడు నీగ్రంథాతిశయమును గాంచి యియ్యది యాంధ్ర దేశస్థులచే నవలంబింపఁబడి దీని యపూర్వము గాననగుననియు నాంధ్ర భాషాభ్యాసు లభ్యసింప నగుననియుఁ దెలిఁగింపఁదలకొంటిని.

---

* లోహ మొండునఁజేసిన వాహ మొండును నిలిపి యియ్యది కాలుచునుండ నలిపి దానిఁదాళుచు నెక్కి-వెలసి వ్రాసి నవ్యాఖ్యానముఁజదివి గాపిలేక కనఁ బడినందున సందియములఁదీర్పుటకయి గ్రంథకర్తయే యవతరించెనని యందఱు నభినందించి యధిగమించి యెంచి యాతఁడొనర్చిన యా సేతకుఁదగి యుండు నదిగ నుండ నీపేరినారోపింపఁజేసిర నికొందఱు

కొంద ఱెత్తి మందలించెదరు.
ఇది కర్ణపరంపర వినికిడివల్ల కథింపబడు కథగఁగనఁబడు చున్నది.



ద్రావిడమున నీగ్రంథము ప్రాస ం బును యతియుఁబడసినది యుఁబడయనిదియునై పలు తెఱఁగులు గలచిన్నవియుఁబెద్దవియు నగు గణములు నాలుగు మూఁడుఁగఁజేర్పఁబడుటచేఁ బెద్దదియుఁ జిన్నదియునై యుండు రెండడుగులుగలిగి చెలఁగు పద్యవిశేష ములవల్లనే పన్నఁబడియున్నది కావున నట్టియొకొ్కకఁ పద్య భావంబొకొ్కకఁ పద్యమందణంగి రెండడుగులవివలె నుండఁ దేటగీతార్థంబులు వాటమైయుండి యాద్యంతము నయ్యవిగనే యుండునటులు దెలిఁగింపనయ్యెను *.

ఈ విధంబుగఁగావిం పఁబడ్డ యియ్యది యీ చెన్నపురిలో వన్నె కెక్కియుండునదియు భూమండలం బెల్లఁ బొగడ్త చెంది యుండునదియునైన - కాంచీపుర ం

- పచ్చయప్ప మొదలారు వారి
విద్యామందిరమందుఁభలు వత్సరంబులు
సంస్కృతాంధ్ర పండితులుగ
సన్నుతికెక్కి యుండిన - వింజమూరు - రామానుజా
చార్యులు వారివల్లను, మఱియు నిప్పుడందు సంస్కృత పండి
తులై సంకాశించుచు నాంధ్రద్రావిడ జ్ఞానాతిశయముతో నధిగ
మించుచు నుండు - తిరువహీంద్రపురం - తిరుమల - ఈచంబాడి-
శతావధాని - శ్రీనివాసాచార్యులు
లాద్యంతముఁ బరిశీలింపఁ బడినదిగ

వారి వల్లనుఁబలు మూఱు
నుండఁజేయఁబడెను.

---

* ఈగ్రంథమున కింగిలీషు భాషాంతరములు
మూఁడునాలు గేర్పడి. యున్నవి. వానిలో పూర్వీకములైనవి
రెండు. అవి కొంత కొంత వఱకు
మాత్రమే కొనసాగినవియై కనఁబడుచున్నవి.
రెండడుగుల పద్యములుగ నుండఁజేయనయి
మూఁడవది మూలగ్రంథముపలె
వ్యాఖ్యానాదులతో పోప్దొ
(Rev. G. U. Pope, M. A., D. D.) అను పుణ్యపురుషు

వలనఁగపవఱకును గలదిగఁబోడ జూపఁబడి నడయాడుచున్నది. కడపటిది యొండిప్పుడు కలిగి యుంటున్నది గనుక వీనింగొని చూచు నెడల నీతెలుఁగుపద్య భావంబును దీని మూలగ్రంథ పద్యభావంబును వేఱిమిలేక వెలసియుండుట విశదమగును.



ఈక్రమంబున నాకృతిఁగన్నదీనిఁగుల విద్యా
ప్రవీణతఁగొని
వెలయవలసిన యొక్కరుఁడయ్యాది తక్క
బాల్యమునందందలి
లక్షణజ్ఞాన లాభము యొక్కయు సంస్కృతజ్ఞాన సంపాదనముయొక్కయు లేమికి గీమయియుండి బెండుపడ్డ యొఱుకువ దండితనముతో వెలసి భారతాది గ్రంథములు గొన్ని వేడుకకుఁ జదివియుండిన వాడుకనుబట్టి వచ్చినట్టి సంస్కృత శబ్దంబులు సమాసంబులు లక్షణోపయోగంబు లుపయోగించి భాషాంతరము సేసి బయలు పఱుపఁబడిన దానింబోలి కానఁబడుచున్నదని పండితోత్తములు బరిహాసపాత్రముగ భావించి పరాఙ్ముఖులు గాక చేతులులేని మూఁగవాఁడు సేయు సైగలం గాంచి
లోకులు వానిలోఁగలిగిన ప్రోఁగుగొనిన భావవిధము
లెఱిఁగి ఫల

మువడనిచ్చి పరిపాలించుభంగి యిందలి విషయ విశేషంబుల
వితర్కించి చూచి యయ్యుపపత్తి యంగీకరించి యాదరింతురని
యభినందించెదను.

ఈపీఠికయందు బదియవ పౌరటలోఁబ్రకటింపఁబడి యుండు
నదైన గ్రంథకర్త యొక్కయు సంఘూర్ధ్వకుని యొక్కయు
స ంవాదప్రశ్నోత్తర సంగతిచాలయును సంగ్రహముగ నుండు
నటులు సవరింపఁబడి యున్నది.



# తప్పొప్పులు.

| పద్యము. | బంతి. | తప్పులు. | ఒప్పులు. |
|---|---|---|---|
| ౧౧ | ౨ | తత్వంబు | తత్త్వంబు |
| ౧౮౫ | ౨ | | |
| | | వెనుకదూఱుతద్ధృదయాల్పతనుగయికొని. | వెనుకదూఱుకొంచెతనంబుననుసరించి. |
| ౧౯౬ | ౨ | యనంబలుకుత. | |
| ౨౦౮ | ౧ | జెడుట | |
| ౨౨౧ | ౨ | ప్రతినిరీక్ష్యార్థయుతము. | |
| ౩౨౧ | ౨ | కర్మఖండను | |
| ౩౫౨ | ౨ | జనములకు. | |
| ౩౫౫ | ౨ | తత్వార్థము | |
| ౪౧౨ | ౧ | మందు | |

| | | |
|---|---|---|
| ౪౧౨ | ౨ | కడుపునకు |
| ౪౧౪ | ౧ | వినుగాక |
| ౪౨౩ | ౨ | తత్వార్థము |
| ౫౦౬ | ౧ | ఊడినట్టిర |
| ౫౩౯ | ౨ | దృఢము |
| ౫౬౦ | ౧ | వాఙ్గుక్రియా |
| ౫౭౩ | ౧ | లయమాన |
| ౫౮౨ | ౧ | నన్నియెపుడు |
| ౬౨౧ | ౧ | డాని |

యనంగొననగు.

నెడుటు
బదులుతోనగుగుణముది
కర్మములన్నియు
మనుజులకు.

తత్వార్థము
మందుఁ
గడుపునకు
వినుఁగాక

తత్త్వార్థము

ఊఁడినట్టిరి

బలిమి

షట్రిపు—యాం

లయుఁగాంన

నన్నినెపుడు

దాంనిఁ

| పద్యము. | బంతి. | తప్పులు. |
|---|---|---|
| ౬౬౦ | ౨ | నట్లు. |
| ౬౯౮ | ౧ | బాలురను |
| ౭౩౫ | ౨ | వర్జ్యంబు |
| ౭౮౨ | ౨ | దలుగు |
| ౭౯౫ | ౨ | నెలుఁగఁబ్రో |
| ౮౧౦ | ౨ | భేదనము |
| ౮౪౬ | ౨ | డాఁచని |

ఒప్పులు.

నటులు.

బాలురల

బాహ్యంబు

దఱుఁగు

# నెఱుఁగుప్రో

# భేదము

# దాఁపని

౯౨౭ ౧ మఱుఁగెఱిఁగియుండు
) కిటుకెఱిఁగియుండు

గ్రామసంహాసితులౌదు ) నూరిలోఁ గేరఁబడుదు

౯౮౫ ౨ అసువులకును. ఆత్మలకును.

౧౩౦౭ ౧ పాతిక పాతిక

పీఠికయందు - ౨ - వ - పొరట కడపటి బంతి యందును

౬ - వ - పొరట - ౨ - వ - బంతియందు

నుండెడు - మైలము - అనునది

యిప్పుడు మైలాపూరనియు నాద్యక్షర భేదముచే మయిలా పూరనియు వాడుకొనఁబడు చున్నది. ఇది సంస్కృతమందు మయూరపురి - అనియుండి యున్నది.

---

తప్పొప్పులు. 16a

# పద్యము-బంతి తప్పులు.

ఉ॥ ౧ { తమప్రజల తెల్వికలిమి
రుంద్రతమమహిని

" ౩ { గలయసువులన్నిటికిఁ
దమకంటెనింపు

౭౭ ౧ క్రమముగాల్చుఁ

## ఒప్పులు.

తమ ప్రజలు దమకంటెఁ

| | | |
|---|---|---|
| ౩౮౬ | ౧ | భుండనిష్ఠురవచనుఁడు |
| ,, | ౨ | గానయినఁబతి |
| ౪౪౦ | ౧ | కోరి కెఱుఁగక<br>యారగింపఁ |
| ,, | ౨ | జాలినను శాత్రవుల<br>కృతిజాలమవియు |
| ౫౬౦ | ౧ | పితుక వాఱుగుక్రియా. |
| ,, | ౨ | ములనుమఱతు రేలిక<br>కాపుసలుపఁడేని |

ఈరసపు విత్తు
దెసను దెసలు
చంపియగుసిరి
భుండునిష్ఠురవచనుఁడు
గాఁడయినఁబతి
కోరు తెలుఁగక
కుడువఁజాలు
నేనిఁదనశాత్రవులకృతి
హేతువవియు.

పితృకవృష్ట్రిరాయా
ములనుమఱతురుభ ర్త
తాఁ బ్రోవఁ డేని.



| పద్యము-బంతి | | తప్పులు. |
|---|---|---|
| ౫౭౪ | ౨ | డుంటనెడ తెగి |
| ౭౦౭ | ౧ | తోడుసుఁ గొమమురి |
| ౭౭౫ | ౧ | నట్టిప్రోడల |
| ౮౦౫ | ౨ | కనులేఫలాస్పదములో |

# బప్పాలు.

డుంటయొడ తెగి
తోడుసుదానమరి
మించినారల
దృష్టిఫలాభియెవియొ.

# తెలివియది

౭౨౬ ౧ కత్తిఁగొననేల — మిత్రోనేది

,, ౨ విద్దెఁగననేల — దోసనేది

౭౩౫ ౨

౭౩౬ ౧

మాఁటవర్జ్యంబునాడు | ండు ఏఁటిలేములదినాడు

చెట్ట — చేటు

,,

౨ { యట్టిదనుదురునాళ్ల — దానిననుదురునాళ్ల
లోననువునాడు — లోతల్లినాడు.

౭౩౭ ౨ నారినదినాడు

వర్తిల్లునాడు.

౭౩౯ ౧ సిరులదేనాఁడునాడు — సిరులదినాడుకాదు

,, ౨ { కాచువెదకఁగసిరుల — కాఁపువెదకఁగసిరు
నీఁగలుగునాడు — లోఁసఁగఁగలనాడు.

౭౪౫ ౨ సుఖగుణ్యామదియ

సుఖధర్మమదియ

౭౬౦ ౨ డునొకటిగను

డునొకపరిగ.

౭౭౨ ౨ శక్తిసుఖము

శక్తిమేలు.

౭౮౦ ౨ { మృత్యువొందున<br>దర్పమగువలచియు

మృత్యువర్పతనొందు
నడిగికొనుట.

౭౮౪ ౨ మించుదలల్పైఁ

మించుదలలఁబైఁ

త ప్పొ

పద్యము-బంతి    తప్పులు.

౬౭౯ ౨ దృఢత

౬౯౨ ౧ కాపింపని / యతని చెలిమి

౬౯౪ ౧ గుత్సఁదలఁచు

౬౯౭ ౧ తలంపులకోఁజుఁ / తలిడువాని

౭౦౧ ౨ తలఁచు

ఒప్పులు.

నిలుపు.

స్నేహంబుఁ జే
యనియతండు
గుత్సకళుకు
తలంపజాలనోదవఁ
గలయవి
తవులు

| | | | |
|---|---|---|---|
| ౮౦౪ | ౧ | చెల్మితగవునఁజెయిద మిచ్ఛించియుండ్రు | ఇచ్చతగవునతృషవహి యించియుండ్రు |
| ౮౦౭ | ౨ | రిష్టగతిని | రిచ్ఛగతిని |
| ౮౧౨ | ౨ | పెరిగినవిజిగిన | నెనసినవిడిచిన |
| ౮౧౬ | ౧ | కడఁగ్రిక్కిఁజేసిన | |
| ౮౩౪ | ౧ | యన్యులనని | |
| ౮౩౬ | ౨ | వగనెఱుఁగకజ్ఞుఁ | |
| ౮౪౧ | ౨ | లేమిగఁజూడ | |
| ౮౫౩ | ౨ | లేమిగస్థిర | |
| ౮౫౫ | ౧ | మెడనోరగిలి | |
| ౮౬౪ | ౧ | నైజవితని | |
| ౮౭౬ | ౨ | దిరుగవిడుత | |

లేనియచల

మెదురోరగిలి

నిలుపితని

దిరుగనిడుత.

గనుదస్యులకడు.

నొంచుమించుగా

| పద్యము-బంతి | తప్పు |
|---|---|
| ౯౩౦ ౨ | దలవఁడౌకొ |
| ౯౮౯ ౨ | బనఁబడు మే<br>ల్మిగలవారు |
| ౧౦౦౯ ౧ | నయముఁగనక |
| ౧౦౨౦ ౨ | చేనసుభ్రమఁ<br>బూన్పినటులు |
| ౧౦౬౧ ౧ | వారిఁబోలు |

,, ౨ పోల్చుటఁగల

౧౦౭౩ ౧ తృషఁగొనునదారలను

ఒప్పులు.

దలఁపఁడొక్కొ

బనఁగబ

లైనయువారు.

వృషముఁగనక

చేతఁబ్రాఁణినా
భ్రమయుడినటు.
వారివంటి
పోలుపితరజాతు లెడ
తృషఁగొనునవి

శ్రీ

అంకితము.

శా. శ్రీవిష్ణుండు సదాశివుండు విబుధ జ్యేష్ఠుండనం దోఁచిలో
కావిర్భావ లయ స్థితి క్రియల లీలావృత్తిఁగాఁగొంచుఁదా
నేవేలుంగొనకుండి వేఱగుచు హాయిం దేలుచుందన్నుఁదా
నేవాఁగించుచుఁదాను దానయినదానిన్నేఁబ్రశంసించెదన్.

చ. రమ యుమ వాణి నాఁదగి యురంబున
సంహాననంబునన్

రస - జ్ఞమహిమ నుండ నుంచి కొనఁజాలి
వెలుంగుచు · జోలిలేన్నిద్ర - సమయ
మయంబుగా సమయ సత్త్వవికాస
మయంబుగాఁ బ్రజా - సమయము లేలు
మూర్తులుఁగ
సాఁగెడు దానికి నేను సాఁగెదన్.

ఉ. అంబరముఖ్య
భూతనిలయంబయి యుండిచరాచరాదియా

డంబర ముల్లడింపఁగ నడంపఁగనిం పఁగనై సమస్తవి
శ్వంబులుఁదన్మయంబుగ నెసంగిన దాని మదీయ మానసం
బుం బెడఁ బాయ నీక తను ప్రముకుఁగఁ జేసిన దాని
ప్రమోకెదన్.

క. చండకర శీతకర ముఖ - మండలము లమర్చి
జలధిమండల
వ్రతభూ - మండల మమరించిన యల
- యొండెయ్యది
యదియొడంద నుండఁ దలంతున్.

శా.

కాంచీనామ మహాధనంబనఁగ సంకాశింప దీర్ఘోర్మికా
రింఛోళీ లసితాంబుధింగొనిన ధాత్రీమండలంబెందునున్

గాంచీమండల మొప్పునట్టిదిగ నొక్కండేదియున్ లేదు నాఁ
గాంచం జేసిన దేది దానికి నమస్కారంబు నేఁజేసెదన్.

మ. అలకాంచీ నగరంబునేలిన యనంతా ధీశ్వరాధ్యాన్వయం
బులలో నాతన భూరితేజమునకొప్పుంగాంచు తేజంబుతోఁ

బొలుపా వహ్నిని
వహ్నిజాన్వయమనన్ భూమండలిం

దోఁచివ - ర్తిలి వర్ధిల్ల నమర్చె నేది

యది వ ర్తిల్లున్

మదీ యాత్మలోన్.

గీ. కంచిసీమ లోకములోన మంచిసీమ - యయ్యా
దేలఁగల్గిన

యొడయలె యొడయలు - తొడరి వహ్నిజా
న్వయులల

యొడయలగుచు-వెలయనిడినదాని నెడం
దనొలయనిడుదు.

గీ. అట్టివహ్నిజాన్వయులైన యా యొడయలు - వనధివలయిత
వసుమతీ వలయ భరణ - నాయకత్వాఢ్యు లయిదాన
నాయకులన - నుండనిచ్చిన యొండెద నుండనిత్తు.

సీ. వసుధలో వహ్ని జాన్వయులు దామట్టుల నాయకులయి
మహోన్నతి వహింప - నల నాయకులలోన నతులితకీర్తి
సంపన్నుఁడొకఁడ యయి పరిధ విల్ల - నాకీర్తి మంతుఁ
డౌ ననఘుఁడు చెంగల్వరాయ నాయకుఁడుగా రమణ
కెక్క - నాతని యార్జితం బంతయు జీవనోపాయ విద్యా
శాలలై యొసంగ - నేది యమరించెఁబరమ మునీంద్రు లేది
శ్రవణ మిడుదురు ప్రణవ సంరావముగను - విశ్వమయమైన
దేదియవిశ్వమైన- దేదియదినాయెడఁదవీది నెలయఁబ్రోది.

## అంకితము.

19

సీ. శ్రీరమా రమణ పంకేరుహాంఘ్రి

యుగంబు పట్టుగా

నెవనికి బలకరించె - నభినుత దేవయాంబ

సుచారిత్ర

తల్లిగా నెవనికినుల్లసిల్లె -

మాననీయుఁడు పెరుమాళ్ళాయక

ఘనుండు తండ్రిగా నెవనికిఁదావు కొనియె - తనయార్జితం

బంతయును గీర్తికామినిగానుండ నెవనికిఁ గాపుఁగట్టె

నట్టి చెంగల్వరాయ నాయకవరేణ్య - ఖ్యాతికేనొనర్చినత్రివ

ర్గమను కావ్య - మంకిత మొనర్చునట్టు

లెయ్యది యొనర్చె

దానికె యొనర్తు నతులు భద్రం బొనర్ప.

సీ. తనయార్జితం

బెల్లధర్మకార్యములకే యుపయోగముగ నయి

యొలయుచుండ - నాధర్మములును

విద్యాశాలలై మును

పెప్పుడు లేనివై యొప్పుచుండ - నాశాలల ననాథు

లోబాలు

రన్నాదు లానుచుఁ జదువుల నందు చుండ - నా

చదువులు

జీవనాధార మార్గముల్ నేర్పెడునవిX

రాణించు చుండఁ

గడఁగి సల్పిన

ఘనుని చెంగల్రాయ - నాయకుని బల్

సమాఖ్యకు నా సలిపిన - యీ త్రివర్గ

మంకితముగ నేను

సలుప - నేది సలిపె నయ్యది నాకుఁబ్రోది

సలుపు.

సీ. చెలరేఁగి చాదంతి చెంపల పైఁగొట్టి ముక్కంటి కుత్తిక
ముడికిఁగట్టి - మ్రొక్కులాం వేడిగిబ్బ ముక్కుతుదను ముట్టి
కటికూఁతుఁగన్న గట్టుబుమి నెట్టి - జాబిల్లి నడిఁబొమ్మ చల్ల
కాఁజను మొట్టి చిలువల రొకిమీని తలను మెట్టి - బలువిసం
బిడుకొన్న పాలకడలిఁదిట్టి కలుమెచ్చు సామి కోకకొనఁ

బట్టి - పది దెసలఁజుట్టి తనకీర్తిపరఁగఁబెట్టి - నట్టిచెంగల్వ
రాయనాయక వరునల - కీర్తికీ నాత్రివర్గ మంకితముగాఁగఁ
జేయఁజేసిన దాని నేఁజేయుదు నతి.



సీ. ఏపుణ్యపరులలో
కోపరమోగంబుగఁదమ చెయ్యులుండును
ద్యుతినిగందు - రేమహాశయులువిద్యామహానీయులై వినయవి
లాసప్రవృత్తిఁగందు - రేసాధుమతులు దయాసాగరులనంగ
నాశ్రితుల్దముఁగొనియాడఁగందు - రేధనాఢ్యులుపరులేర్పఱి
చినధర్మకార్యని ర్వాహక ఖ్యాతిఁగందు-రట్టిరగు
పచ్చయప్ప
ధర్మాధికారు-లను స్వధర్మాధి కారులై తనర నిడిన - చెంగ
ల్వ రాయనాయ కోత్తుంగకీర్తి - వైభవమునకు నా యీ
త్రివర్గమంకి - తమిడ నెదియిడె దాని
నుల్లమున నిడుదు.
సీ. ఈ చెన్నరాజధానీ చతుర్దిశల విద్యాశాల
లెవనివిత్తమునఁ
బరఁగు - ధర్మదేవతయనంతముగ రూపము

లెత్తి మలయు

లాగెవని ధర్మములు చెలఁగు-
నలకాశిరామేశ్వరాది దేవళ

ములయర్చల నెవని పేరడరుదెంచు
భూమండలంబెల్ల బో

రుకొనినటించి గడఁగట్టియెవని విఖ్యాతియెకుఁ-
- నట్టికాం

చీపురీపచ్చయప్పఘనుని-
ధర్మకర్తలఁదనమహాధర్మములకుఁ

కర్తలుగనుండనిడిన చెంగల్వరాయ-
నాయకవరేణ్యుకీర్తికి

నాత్రివర్గ - మంకితంబియ్యనిచ్చినదభయమిచ్చు.

క. అని

యిటులఁ జెంగలువరా-య నాయక వరేణ్య కీర్తి
కంకితముగఁ జె - ప్పెను జోకరాని
నరసింహుఁడు - ఘన కృ  తిని

శ్రీ

# త్రివర్గము.

## ధర్మకాండము.—అవతారిక.

### ౧.-టి అధ్యాయము - భగవత్ప్రార్థన.

అర్థగీతి.

౧. అత్తునిఖిలవర్ణంబులకాదిమమగు
నాదిభగవంతుఁడాదిముఁడగుజగతికి.

౨. చదివినందుననైనట్టిసత్తైదియొకొ
విశదవిజ్ఞానసదంఘ్రులు వేఁడ రేని.

౨ 2

3. అలరుపై నేగినతనిభవ్యచరణగతు
లచలపైదీర్ఘముగ వెలయంగఁగలరు.

3 )

౪. ఆశయునిరాశయును లేనియతనిపదస
మాశ్రితుల కేతటిని జేరవత్యయములు.

౪ 4 ౫.

తమము చేఁ జేరునుభయకర్మములుఁ జేర

వధిపుసార్థాభినుతిసముపాశ్రితులకు. ౫ 5

౬. విషయిగతిపంచకనిరోధ్యవితథలసిత
చరితగతిసంస్థితులుమండ్రునిరతముగను. ౬ 6

౭. తనకుసామ్యము లేనియాతనిపదాశ్రి
తులకుఁగాక మనోవ్యథత్రోయుటరుచు. ౭ 7

౮. పుణ్యశరధిపూరుషపదాప్తులకుఁగాక
యన్యశరధులీఁదెడునదియరిదియగును. ౮ ౭

౯. అగ్రహణహృషీకములట్టులఫలములవి
యష్టగుణుపదానతిలేనివగుశిరములు. ౯ ౯

౧౦. జననఘనవార్ధినీఁదుదురనయమీఁద
రధిపుపదనావఁజేరనియట్టివారు. ౧౦ ౫

2

## త్రివర్గము - ధర్మకాండము.

### ౨-వ అ-ము - వృష్టివిభవము.

౧౧. వారిదముగల్గిజగముండివచ్చుకతనఁ
దానమృతమంచు నెఱుఁగుతత్వంబుకలది.

౧

౧౨. కుడుచువారికిఁబ్రియమైనకుడుపులొసఁగి
కుడుచువారికిఁగుడుపైతగునదియుజడి.

౨

౧3. వానలేకయబద్ధమా నేనిజలధి
వేష్టితోరుజగత్తులోవెతనిడుగొంద.

3

౧౪. హాలమువలనదున్నరుకృషీవలులువర్ష
సలిలవిభవసంశ్రయముపొసంగినతఱి.

౪

౧౫. చెఱుచునదియునాసరయయిచెడినవారి
కటులమఱలఁబ్రోచునదియునంతయుజడి.

౫

౧౬. భతలముదిరపృషత్తులువడినఁగాని
యరిదికనుటహరిత్తృణశిరములపుడ.

౬

౧౭. ఘనపయోధియుఁగుందునుదనసహజత
కొనిపయోదముదానటఁగురియదేని.

౭

౧౮. విభవమునుబూజయునునెఱవేఱదిచట
ఋభులకును వారిదమువఱపెనయునేని.

౮

౧౯. దానముఁదపంబురెండునుదక్కుఁబృథు

భూతలమునందువర్షముపోడమ దేని.

౯

౨౦. జలము లేక లే దెవరికింజగతియన్న
ఘనము లేక లేదుడుగక కాలుటయది.

౧౦ త్రివర్గము - ధర్మకాండము. 3

3 - వ అ - ము - పరివ్రాజకమహిమము.

౨౧. చరితసంస్థితిఁగన్నమస్కరుల పేర్మి
వలచుమంచివియందు శాస్త్రలిఖితములు.

౧ ౨౨. మస్కరుల పేర్మికొలఁదియమర్చననిల
సంస్థితుల నెంచికొనినప్రసక్తిఁబోలు.

౨ ౨3. ద్వయగతు లెఱి
ంగియీసముద్భవమునవృష
భరితులమహత్వ మేప్రథఁబడసెజగతి.

3

౨౪. ప్రేక్షయనునంకుశముచేనొకేనుఁగాచు
నాతఁడొకవిత్తనముపరమునెడియెడకు.

౪

౨౫. ఐదుఁద్రెంచినాతనిశక్తికతులనాక
వాసవర్యగోత్రభిదుండవఁజలుబుజువు.

౫

౨౬. అఘటనములఘటింపుదురార్యులల్పు
లఘటనములఘటింపనియట్టివారు.

౬

౨౭. నినదరసగంధభాస్పర్శమనునయిదిటి
గతులనెఱుకొందునామర్త్యుకడదజగతి.

౭

౨౮. నిందువాక్కులమనుజులదండితనము
మంత్రవాక్కులబుజువుగమహిఁదెలుపును.

౮

౨౯. గుణకుధరమెక్కినిల్చినజనులకినుక
క్షణమయయినన్స్మరించుటకడిఁదియగును.

౯

౩౦. సాధులను వారుసుకృతానుసారు లెల్ల
ప్రాణులకుఁబ్రోచ్చదయఁబూనివర్తిలుటను. ౧౦

4 త్రివర్గము - ధర్మకాండము.

౮ - వ అ - ము - ధర్మనిరూపణము.

౩౧. అలవిభవమిచ్చుశ్రీయిచ్చు నాత్మలకును
సుకృతమునకంటె లేదుప్రచురపుకలిమి.

౧

౩౨. సుకృతమునకంటె లేదుప్రచురపుకలిమి
యదికొనమికంటె లేదుమహావ్యథయును.

౨

౩౩. సాధ్యపద్ధతిధర్మవిషయము లెపుడుఁ
జెల్లుపట్టుల నెల్లను జేయఁగాత.

౩

౩౪. స్వాంతమునను దోషములేనివాఁడగునది
యంతెసుకృతమార్ఘటవిషయములు పెఱలు.

౪

౩౫. ఈర్ష్యతృడమర్షరూక్షోక్తు లీరురెండు
నాజ్ఞ్పచరించినట్టిదయగుసుకృతము.

౫

౩౬. నాఁడెఱుంగుదమనక యొనర్పఁగాక
శ్రేయమయ్యది చెడుతఱి చెడనితోడు.

౬

౩౭. సుకృతగతియిదియనుచు బేరుకొనవలదు
శిబికపయికొనినతని మోసినతనిఁగని.

౭ ౩౮. వృథగదినములువడక మేలిడనదొకని
మనికిదినములపథముపోవాన్నుచాఱాయి.

౮

౩౯. ధర్మమునవచ్చునదె సౌఖ్యదంబితరము
సర్వమితరంబులును నిర్యశసుఖములును.

౯ ౮౦. చేయనర్హమైనది శ్రేయమే యొకనికిఁ
బాయనర్హమైనది గర్హణీయమయగు.

౧౦

త్రివర్గము - ధర్మకాండము. 5

ప్రవృత్తి ధర్మ ప్రకరణము.

౫ - వ అ - ము - గార్హస్థ్యము.

౮౧. గృహియనునతండు నిజధర్మ సహితులగుము
వురకును సువృత్తపథమందమరినతోడు.

౧

౮౨. మస్కరులకును మోసవనిమనుజులకును
సంస్థితులకును గృహియనుజనుఁడు తోడు.

౨

౮౩. యామ్యదేవాతిథిస్వజనాళి తాను
నాగనేనింటిగతిరక్షణము ప్రథమము.

౩

౮౪. అఘమునకుజంకి పంచికుడ్పందె నేని

బ్రదుకతనిసంతొకష్టఁగోల్పడుట లేదు.

౪

౪౫. ప్రియతయునువృషమునుగలదయిననింటి
మనికిగుణమునుఫలమునుగనినదియగు.

౫

౪౬. పుణ్యసరణిగార్హస్థ్యముఁబొనరించినను
నన్యసరణినేగివహించునర్థమేది.

౬

౪౭. నియమమునసిలుమన్కినుండిమనునట్టి
యతఁడుగడఁగెడియందఱియందునుదొలి.

౭

౪౮. గతినడపిధర్మమునఁదఱుఁగనియిలుమని

కలవ్రతులకంటెసహనసమన్వితంబు.

౮

౪౯. ధర్మమనఁబడినదిగృహస్థతయయదియు
నన్యుఁడపహసించునది లేదైన లెస్స.

౯

౫౦. ధరణిమనుగతిమనెడియాతండుదివిని
నొలయునలదివిషదులలోనుంపఁబడును.

౧౦

6

## త్రివర్గము - ధర్మకాండము.

### ౬-వ అ--ము - సధర్మిణీగుణము.

౫౧. ఆలయార్హయోగ్యతకలదై స్వవరుని
యార్జనార్హజీవనమునకగునుదోడు.

౧

౫౨. ఇంటిమేలాలిచెంతలేదేనిమనికి
యెంతమేలావహిల్లినదేనిలేదు.

౨

౫౩. కలుగనిదియేదిసతిమేల్మిఁగాంచునేని
కలుగునదియేదిసతిమేల్మిఁగాననికడ.

౩

౫౪. కాంతకంటెనుజాలయోగ్యంబులెవ్వి

యాల్వానంబడు నైశ్చల్యమెసఁగఁగనిన.

౪

౫౫. ఈశు నెఱఁగడు పెనిమిటి నెఱఁగి లేచు
నామె కురియు మయనవలాహకము గురియు.

౫

౫౬. తన్నుఁగాచి భర్తను బ్రోచి తగవుఁగన్న
వన్నెఁగాచి చాకుటలేనిదన్న వయగు.

౬

౫౭. చెఱను గాచు కాపే యది చేయు సతుల
నిలుపుఁగాచు కాపే మహనీయతయగు.

౭

౫౮. కొన్నతనిఁ గొన్నఁ గొంచరు గొమ్మలు పెను
మన్ననల మర్త్యులుండెడి యన్నెలవున.

౮

౫౯. శ్రీఘటితజాయ లేని వారికి హసించు
వారిమును లేము కేసరివలె వరగతి.

౬౦. భద్రమందురుగృహిణివై భవములుమఱి
తత్సమండనములుసు సంతానలబ్ధి.

౧౦

త్రివర్గము - ధర్మకాండము. 7

౭-వ అ-ము-పుత్రోత్పాదనము.

౬౧. కనఁదగినవానిలో లేదుకనునదేము
కనఁగలవికాంచుప్రజకాన్పుకాకపెఱలు.

౧

౬౨. పశుపుట్టుకలును జెట్ట లెనయవుపరి
వాదవర్జితగుణతనూద్భవులఁగన్న.

౨

౬౩. తమధనమటంద్రుదమయపత్యములవారి
ధనముదమపట్ల స్వస్వకృత్యములవచ్చు.

౩

౬౪. అమృతమునకంటెఁగడునింపుతమచిఱుతల
చిఱుకయిలనుంచి దేవిన జేమనంబు.
౪

౬౫. కూనలశరీరమంటుట మేనికింపు
వీనులకు వారిపలుకులు వినుటయింపు.
౫

౬౬. వేణువింపగు నింపగు వీణయండ్రు
స్వాత్మజోల్లాపవచనశ్రవణరహితులు.
౬

౬౭. తండ్రిసుతునకుఁ జేయుభద్రము సమజ్య
యందు ప్రథమమునందుండునటులఁ జేఁత.
౭

౬౮. తమప్రజల తెల్వికలిమి రుంద్రతమమహిని
గలయసువులన్నిటికిఁదమకంటె నింపు.

౮ ౬౯. కనినయప్పటికంటెను గరముపొంగుఁ

దనసుతుండుబుధుండనవినినజనని.

౯

౭౦. సుతుఁడుదండ్రికిఁసలుపు మేలితనితండ్రి
ఎదినోముఁసల్పెనువ్రతమనియెడువచనము.

౧౦

౮ త్రివర్గము - ధర్మకాండము.

౮-వ అ-ము - ప్రేమాకలనము.

౭౧. ప్రేమకునుగలదేమూసిపెట్టుగడియ
హార్ద్దపరలఘునేత్రాశ్రులల్లరియిడు.

౧

౭౨. హార్దరహితులన్నిఁటనుస్వీయార్థభవులు

హార్దసహితులస్థులనునన్యార్థభవులు.

౨

౭౩. ప్రియతతోఁగన్నతగవంద్రుబృథ్విఁగీక
సములతోఁగన్నతొడుసుఖాస్వదసువులకు. ౩

౭౪.

ప్రియతమొసఁగుఁబ్రేముడికలిమిమొరులందు
నదియమొసఁగునేస్తమనుమహావిభవము.

౪

౭౫. ప్రియతఁగనికన్నతగవంద్రుబృథ్వియంచు

సుఖముఁగనినట్టివారుగాంచువిభవంబు.

౫

౭౬. ధర్మమునకతోడంద్రుహార్దంబమతుల

మర్షమునకుఁదోడద్దియమాన్యకతన.

౬

౭౭. ఎముకలేనిదానినెండక్రమముగాల్చుఁ

ప్రియత లేనిదానినిదత్సుకృతవిభుండు. ౭

౭౮. ప్రేమమది లేనియసుఁబుజీవించుటెండు
మ్రానుమరుభూమియెడఁదలిరూనినటులు.

౭౯.[౮] బాహ్యసర్వాంగకము లేమిపన్నువిగ్ర
హాంతరస్థాంగహార్దశూన్యపురుషులకు.

౮౦.[౯] హార్దగతిదజీవంబుపట్టద్ది లేని
యాజనులకుఁద్వక్ఛన్నకుల్యములాఁడల్లు. ౧౦

## త్రివర్గము - ధర్మకాండము.

9

### ౯-వ అ-ము-అతిథిసత్కారము.

౮౧. ఉండియేలియింటనుఁబ్రదుకొందు టెల్ల
విందు నేలిసల్పుటకయివితరణంబు.

ర-౨. విందు వెలినుండఁదాఁదింట్రముందనీని
మందయిననిచ్చగిలుటక్రమంబుగాదు.

ర-౩. వచ్చువిందులదిన మేలువానిబ్రదుకు
కష్టసంయుతమయిపాడుఁగనుట లేదు.

ర-౪. మదియలరిలక్ష్మినూల్కొనువదనమలరి
సదతిథులమన్చునాతనిసదనమునను.

ర-౫. విత్తనమునిడవలెనొక్కొవిందునేలి
తక్కినదిభుజియించునాతనిపొలమున.

ర-౬. చెల్లునతిథులఁబ్రోచివచ్చెడునతిథులఁ
గాంచితగునతఁడాదివౌకస్సదతిథి.

ర-౭. ఇంతటికొలందిదనునొంటనెన్నఁబడదు

బంధులకొలందికొలఁదిదధ్వరఫలంబు.

౭

౮౮. అచ్చుపడిప్రోచియొడసితిమాసరంధ్రు

బందుగులఁబ్రోచిసవమునుబడనివారు.

౮

౮౯. కలిమిలోలేమియతిథులకాపుకావ
మియగుమాహత్వమదిమాధులయెడఁగలదు.

౯

౯౦. మూర్ఖుఁడనఁగవాఁడుదిరిసెమువోముచిటిలి

కానఁగనువాడుదురుగృహాగతులుచాము.

౧౦

10 త్రివర్గము - ధర్మకాండము.

౧౦ - వ అ - ము - ప్రియాలాపము.

౯౧. ప్రియవచస్సార్ద్రితం గొనిపికుక్కడిగిన
దగునవక్రార్థవిజ్ఞులయానన్నోక్తి.

౯౨. మదియలరియొసంగుటకంటెమంచిదియగు
మొగమలరిప్రియోక్తిపరుఁడైతగఁగలిగిన.

౨ ౯౩. మొగముననుదనరారియింపుగనుజూచి

యెడఁదనగుప్రియభాషలదేసుకృతము.

3
౯౪. కష్టమిచ్చుకష్టంబుకల్గదెవరియెడ
నిష్టమిచ్చునిష్టోక్తిసహితజనులకు.

౪

౯౫. ప్రవినయుఁడుఁబ్రియవచనుఁడునవుటొకనికిఁ
దొడవులితరములలగుటుతులవి కావు.

౫

౯౬. కానివిక్షయింపసుకృతంబనూనమగును
బాగులనెఱింగిప్రియములువలికెనేని.

౬

౯౭. నయముగనిశుభమొకర్తరునకునొసంగు
ఫలముగనిగుణమందుఁగోల్పడనినుడులు. ౭

౯౮. కృచ్ఛ్రమున నెడసినప్రియోక్తి యదిసుఖము
నచ్చుకొననిడుఁబరమునిహమునొకనికి.

౮

౯౯. ఇష్టభాషలిష్టమునిడు టెఱుఁగునతఁడు
రూక్షభాష లెద్దియొకొ వాక్రుచ్చెడునది.

౯

౧౦౦. ప్రియములుండఁబారుష్యముల్ వినిచెడునది
ఫలములుండవానంబులఁబట్టినటులు.

# ౧౦

## ౧

### త్రివర్గము - ధర్మకాండము.

౧౧-వ అ-ము-కృతజ్ఞత.

౧౦౧. ఒనరుపకమొనరించినయాయుపకృతికిని
నవనియును ద్రిదివమును మాఱగుటయరిది.

౧ ౧౦౨. కాలమందు సల్పినయుపకారమల్ప

మైననుర్వికంటెనుననయముఘనంబు.

౨

౧౦౩. ఫలముఁదూఁపకేసల్పినయలయుపకృతి
నయముఁదూఁపమేలబ్ధికన్నను ఘనంబు. ౩

౧౦౪. నూవుకొలఁది మేలిడినను రేవుకొలఁది
గాను గొనుదురాఫలమెఱుఁగంగలారు.

౪

౧౦౫. కృతముపాటికాదుకృతంబుకృతముసల్పఁ
బడినవారియోగ్యతయంతపాటికలది.

౫

౧౦౬. అఘమువీడ్కొన్నవారిపొందగుమఱవమి

యిడుమఁదోడ్పడ్డవారిపొందుడుగమియగు.

౬ ౧౦౭. సాప్తకికసప్తభవములుఁగాఁ సంస్మరింతు
రార్తితమపట్లఁదుడిచినయాప్తజనాప్తి. ౭

౧౦౮. మేలుమఱచుట మేల్గాదు మేలగునల
నాఁడెమఱచుట మేల్గామినరుఁడుదాను. ౮

౧౦౯. తునిమినదిపోలుకీడొనర్చినను వార
లొనరిచిన మేలొకండెంచనుడుగునన్ని.

౯

౧౧౦. ఎట్టిమేలార్చినారికి నెలయునుగతి
యిడ్డమేలార్చినాతనికెలయదుగతి. ౧౦

౧౨-వ అ-ము- తాటస్థ్యము.

౧౧౧. నడియునికినాఁగనొకఁడన్యాయ్యమంశ
ములవలనఁబాలువడిప్రవర్తిలఁగలిగిన.

౧
౧౧౨. నడియునికికల్గునతనిశ్రీనాసిరిలక

కడలుకొనుబల్లిదముగఁదోకంబునకును.

౨
౧౧౩. మేలయొసఁగిననడియునిఁతూలికలుగు
శ్రీనినలదివసమతప్పఁజేవిడుచుత.

౩
౧౧౪. తగవుఁగలవారులేనివారగునదియొఱుఁ
గఁబడునలవారివారిత్తోకంబువలన.

౪
౧౧౫. క్షయమువృద్ధియులేనివికావుగాన
మదినివంగమిబుధులకుమండనంబు.

౫
౧౧౬. చెడుదునేననునదినిరీక్షించుతఁదన

యెడఁదన్యాయముచెడి కానివిడఁదలఁచిన.

౬

౧౧౭. నష్టముగజగంబునుపదునడిమిగసుకృ
తంబుకడననిల్చినతనితగ్గుదలను. ౭

౧౧౮. సరిపఱచియొప్పునిడుత్రాసుకరణినమరి
యొకకడనువంపుగొనమియార్యులకుఁదోడవు. ౮

౧౧౯. మాటవంకరలేనిదిమధ్యమెడఁద
లోనువంకరలేమిపెల్లుగఁగనినను. ౯

౧౨౦. బేరమొనరించువారికిబేరమగును
గాచియితరార్థమునుస్వార్థగతిసలిపిన. ౧౦

## త్రివర్గము - ధర్మకాండము. 13

### ౧౩ - వ అ - ము - వినయాకలనము.

౧౨౧.
అణఁకువయమర్త్యులెడఁగూర్చునణఁగమియల
విపులతిమిరంబుకడఁగూర్చివిడుచుఁబిదప.
౧

౧౨౨. మనుచుతఁబ్రయోజనంబుగనణఁకువసిరి

మనుజులకుదానికంటెహెచ్చినది లేదు.

౨

౧౨౩. వినతియెల్లఁగంగఁబడిపెర్మినుచునెల్లక

యనఁగనెల్లఁగంగనయిదారినణఁగఁగన్న.

౩

౧౨౪. ఉనికియెడమాలుపడకుండియణఁగినతని
పొడవుధరణీధ్రమునకంటెఁగడుఘనంబు.

౪

౧౨౫. అందఱకుశ్రేయమగువినయంబువారి

యందునగుశ్రీలురకెశ్రీసమంచితంబు.

౫

౧౨౬. ఒకటఁగమఱోపమితిగఁబంచకమణఁచుట
నొనరిచిననేడిటనుభద్రమునువహించు.

౬

౧౨౭. పవియేల రేనియుజిహ్వా నేలవలయు

నేల రేనివాక్శక్తి నేలియేల్లురు వెత.

౭ ౧౨౮.

ఒకఁడయినదుర్వచోర్థప్రయోజనముగ

నగుటయున మేలుకానిదియైవిడుచును.

౮

౧౨౯. అగ్గిచేఁగాల్చినట్టిపుండాఱులోన

నాఱదురసజ్ఞచేఁగాల్చినట్టిచిన్నె.

౯

౧౩౦. క్రుధనుగాచి నేరిచియణంకువవహించు

నతని వేళఁజూచునుధర్మువరిగిగతిని. ౧౦

## ౧౪ - వ అ - ము - వృత్త్యాకలనము.

౧౩౧. వృత్తమఖిలులకును శ్రేయమిచ్చుకతన
వృత్తముసుఋనకంటెవర్ధింపఁబడును.

౧

౧౩౨. పనిగనేలికాచుతవృత్తమునుమనుజులు

దెలిసియేలితేఱిననయ్యదెయగుఁదోడు.

౨

౧౩౩. వృత్తసంపత్తిగోత్రసంపత్తియగును
క్షుల్లకోత్పత్తియైవిడుచుననివృత్తి.

3

౧౩౪. మఱచినఁగాశ్రుతికొననగుమఱిద్విజుండు

జననవృత్తముదఱఁగ నాశంబునొందు.
౪

౧౩౫. ఈర్ష్యకలవానికడశ్రీ మెయిఁగనువృత్త
బాహ్యుకడనావహిల్లదుప్రాభవంబు.
౫

౧౩౬. వృత్తమునబకొఁటిలరువివేకపరులు
విచ్చుటనుబొచ్చెమదిపడువిధము నెఱిఁగి.
౬

౧౩౭. వృత్తమునఁగంద్రుపెరిమెనివృత్తియందుఁ
గంద్రుకననొల్లనిదియగుగర్హణంబు. ౭

౧౩౮. ధర్మమునకువిత్తగుసువృత్తంబుదుష్ట
వృత్తమెపుడుఁగృచ్ఛ్రము వెలయించు రెంట. ౮

౧౩౯. వృత్తసమభియుక్తులకావహిలుటలేదు
దుష్టములనుదప్పియునోరితోనుడువుట. ౯

౧౪౦. లోకమునుగూడినడుచుటనైకములను
నేరిచియునేరనిజనులుధీరహితులు. ౧౦

## ౧౫ - వ అ-ము - పరసతీవిరాగము.

౧౪౧. పరధనీభూతనిచ్ఛించితిరుగుఁజడిమ
యిలనుధర్మార్థలబ్ధవర్ణులెడలేదు.

౧

౧౪౨. పుణ్యపరసంస్థితజనౌఘమునను బరుని
సద్మపరసంస్థితులఁబోలుజడులు లేరు.

౨

౧౪౩. మృతులకంటెనన్యులుగారుమిఁగులనమ్మి
నతనియింటికెగ్గుదలంచియరుగువారు.

౩

౧౪౪. ఎంతటిపొగడ్తవారైననేమియగును

సుంతయుఁదలంపకొరునిల్లుచొచ్చుటయది.

౪

౧౪౫. సులభమనిగృహముసుగడచునతఁడొందు

నవిశమునుబొలియక నెలకొనుజుగుప్స.

౫

౧౪౬. పగ వెఱపుకిల్బిషముజుగుప్సయను నాల్గు

వదలవటయింటఁగడచెడువారలయెడ.

౬

౧౪౭. పుణ్యనియతిఁగొన్నగృహస్థుఁడన్యనియతిఁ

గొన్నయువతిస్త్రీత్వమునిచ్ఛఁగొననియతఁడు.

౭

౧౪౮. అన్యసతిదృష్టినిడనిదొడ్డగుమగటిమి

మాన్యులకుధర్మమొకఁడొసంపన్నవృత్తి. ౮

౧౪౯. భవుక సంబంధు లేరన్నబహుజలొర్వి

నితరసంబంధినీభుజాస్పృగ్రహితులు. ౯

౧౫౦. పుణ్యవిధివర్తి గాక తప్పలిడినఁ బస
యన్యవిధివర్తినీస్త్రీత్వమాసపడమి. ౧౦



౧౬-వ అ-ము-క్షమాకలనము.

౧౫౧. త్రవ్వువారల మోచుగోత్రవలెఁదమ్ముఁ
దిట్టువారలనోర్చుటాధిక్యమగును.

౧

౧౫౨. తాళుటగుమీఱు కెప్పును దానిమఱచి
పోవుటగుదానికంటెను భావుకంబు.

౨

౧౫3. లేమిలో లేమివిందులఁబోములపుట
త్రాణలోఁద్రాణయజ్ఞులఁదాళుటయగు.

3

౧౫౪. నిలుపుకలిమిఁబాయమిఁగోరెనేనినోర్పుఁ
దనముకలిమిఁబాయమిఁదాలిచినడువనగు.

౪

౧౫౫. కుపితులనొకండుగాఁగయికొనరుకొంద్రు
క్షమితులవసుప్రకారమాచ్ఛాదనమిడి.

౫

౧౫౬. క్రుద్ధులకువచ్చునట్టిదొక్కదినసుఖము
క్షంతలకుఁజచ్చునంతదనకయునుయశము.

౬

౧౫౭. గుణముగామిఁదనకొరులుంచినను బాగు
వృషముగామినునుపమినొప్పికయునొచ్చి.

౭

౧౫౮. మించుదలవల్లమించుటలుంచినఁదమ
యంచితమువల్లవాండ్రుజయించుటతగు.

౮

౧౫౯. మస్కరులపోలికనిర్మలాత్మకులగుదురు
సాత్యయులనోరిదుర్వచస్సహనపరులు. ౯

౧౬౦. కుడువకోర్చువారొకరులునుడువునుడుకు
నుడువునోర్చువారలకు వెనుకనధికులు. ౧౦

## త్రివర్గము - ధర్మకాండము.

17

### ౧౭-వ అ-ము - అసూయారాహిత్యము. ౧౬౧.

శీలపథముగనొకరుడు జెందుగాక
యీర్ష్య నెడసిన సహజత నెడదయందు.

౧ ౧౬౨. భావుకశ్రీల లేదట్టిపాటి దేరి
చోనునీర్ష్యాప్తి లేకుంటబూనె నేని.

౨ ౧౬౩. ధర్మధనకాంక్ష లేనియాతడొరుధనము
హర్షిలక యీరసించెడియాతడగును.

౩ ౧౬౪. ఈర్ష్యవలనగానివిచేయరెగ్గువలన

దోసమగుటనారసిసముత్తుంగమతులు.

౪ ౧౬౫. ఈర్ష్యకలవారిక దేచాలు నెడరునియ్యఁ
జాలినదివైరులగువారుజాలినటను.

౫ ౧౬౬. పెట్టునదియీరసిలువానిచుట్టములకుఁ
గట్టునదియానునది లేక చెట్టయగును.

౬
౧౬౭. అక్షమతఁగొనియీరసమందువాని
లచ్చికనుఁగొనఁజేయునొల్లక పెదమ్మ.

౭ ౧౬౮. ఈర్ష్యయనునొక పాపియదృష్ట మెడపి
దుర్గతికిఁదనవానినిద్రొబ్బివిడుచు.

౮ ౧౬౯. ఈర్ష్యపడుచిత్తువృద్ధియువృత్తపరుని
క్షీణతయుఁగల్గియున్నయోజింపఁబడును. ౯

౧౭౦. ఈరసిలివర్ధిలినవారు లేరుదద్వా
చూరులభివృద్ధి వెలియైనవారు లేరు. ౧౦

## ౧౮_వ అ-ము - అభిధ్యారాహిత్యము.

౧౭౧. మధ్యమము లేక సద్ధనాభిధ్యఁగొన్న
నన్వయముదీర్చి తప్పును నట్టెయిచ్చు.
౧

౧౭౨. అగుఫలంబునకయి యభిధ్యఁగొని నింద్య
ములనొనర్పరు నడిలేమికళుకువారు.
౨

౧౭౩. అల్పసుఖమానని యభిధ్యఁగొని చేయ
రన్యసుఖకాములు సుకృతాన్యములను.
౩

౧౭౪. పేదలమని వహింపరభిధ్య జితహృ
షీకవిగతకలంకదృష్టివిలసితులు.
౪

౧౭౫. శితమయియదభ్రమగు తెల్వి చేయుబెద్ది
యెవరికినభిధ్యఁగొనియొప్పనివిసలిపిన.
౫

౧౭౬. ఘృణనభిలషించిదారినిల్పినయతండు
ధనమభిలషించిద్రోహముల్దలఁపఁజేడును.
౬

౧౭౭. అభిలషింపకుండుతమభిధ్యఁగొనికాంచు
కలిమిదుర్లభంబగునుభోగమునఫలము.
౭

౧౭౮. నాశిలమికల్మికెద్దియన్ననునభిధ్యఁ
జేకొనమియన్యుఁడిచ్ఛించుచేయొడమెకు.
౮

౧౭౯. ధర్మమెఱిఁగియభిధ్యఁజెందనివివేక
ధన్యులనుసిరిపొందుయుక్తముఁగనియటు. ౯

౧౮౦. అవిధినిచ్చనెంచకయభిక్ష్యఁబడసినను
జయమునిచ్చునొల్లమియనుసమ్మదంబు. ౧౦

## త్రివర్గము - ధర్మకాండము.

### ౧౯-వ అ-ము-పశ్చాదనిందనము.

౧౮౧. ధర్మములనాడఁడయివికృతములిడినను
గర్హణములాడఁడనుటసుఖంబొకండు.
౧౮౨. వృషమునెడపెట్టిచెట్టలువెట్టుకంటె
వెనుకఁజెడఁదిట్టిదబ్బరగనగు పెగ్గు.
౧౮౩. కుత్సలాడియబద్ధంబుఁగొనిబ్రదుకుట
కంటెఁజావువృషంబెంచుకల్మినొసఁగు.
౧౮౪. చూడదయఁజూడకాడిననాడవలదు
చూపెదుటలేకమీఁదునుజూడనినుడి.
౧౮౫. సుకృతమాడుచిత్తుఁడుగామిఁజూడఁబడును

౧

౨

౩

౪

వెనుక దూఱు తద్హృదయాల్పతను గయికొని.

౧౮౬. ఇతరదోషభాషకుఁడు స్వకీయదోష
కులములోనఁ గ్రూరము లెత్తి పలుకఁబడును.

౧౮౭. పగకలుగఁబల్కి—చెలికాండ్రఁబాపుదురున
గవుకలుగఁబల్కి—హితమాటఁగననివారు.

౧౮౮. తోడరినజనాళిదోషముద్దా ఉనట్టి
సహజగుణు ళేదిధ్యొకో విపక్షకులపట్ల.

౫

౬

౭

౮

౧౮౯. సుకృతమునుజూచితాఁదాలుచునోకో ధాత్రి
యటవెనుకఁజూచిదూఱాడునతనిబరువు.

౯ ౧౯౦. ఒరులతప్పటుతమతప్పునరయఁజాలి

ననువిపత్తికలదెయుండెడునుసుఖునకు.

౧౦



౨౦ - వ అ - ము - వ్యర్థాకథనము.

౧౯౧. పలువురల్లనుఫలశూన్యములువచించు
నతఁడుగర్హణమునుగాంచునందఱియెడ.

౧

౧౯౨. అఫలములనుబల్కుటప్రేమోలననుటచెట్ట
యనయములనుమిత్రులకాన్చునంతకంటె.

౨

౧౯౩. అనయుఁడంటనువచియించునఫలములను
నధికతంగొనవచియించునావచనము.

3

౧౯౪. నయముఁగొనకభద్రముననుండియెడఁబాపు

ఫలముఁగొననినిర్గుణవచస్సులెవరియెడ.

౪

౧౯౫. గారవముపొగడికతోఁడఁగాడ్పడుఫల

హీనములుగుణయుతులాడి రేనినపుడ.

౫

౧౯౬. ఫలరహితవాక్యములఁగడుఁబల్కువాని

నరుఁడనకమానవతుషయనంబలుకుత.

౬

౧౯౭. నయవిరహితములనుబల్కిననుబలుకుత

ఫలవిరహితములనుబుధుల్ బల్కమిపస.

౭

౧౯౮. అతిశయితఫలమారయుప్రాజ్ఞులనరు

ప్రబలతరఫలమూడినభాషితములు. ౮

౧౯౯. ఫలముదీజినయవివచింపరుమఱచియు

భ్రమముదీజినయలవినిర్మలధిషణులు. ౯

౨౦౦. తగునుబల్కఁబల్కఁలఫలదములువల్కఁ
దగదుబల్కఁలందఫలములగుపలుకులు. ౧౦

## త్రివర్గము - ధర్మకాండము. :21

### ౨౧-వ అ-ము-పాపభయము.

౨౦౧. భీతిలరుదుష్కృతాత్ములుభీతిలుదురు
సాధువులుదుష్కృతాహ్వాయ జాడ్యమునకు.

౧

౨౦౨. దౌష్ట్యములుదౌష్ట్యములనిచ్చుదానివలన
దౌష్ట్యములుపావకునికంటెదరమొసంగు.

౨

౨౦౩. జ్ఞానములసమస్తములఁబ్రధానమంద్రు
ఘాతుకులకుఁజెట్టలనిడకయుడుగుటను.

3

౨౦౪. మఱచియునునన్యువెతలనుంపకుఁడూనిచిన
వృషమునుచునుంచినతనికివెతలనపుడ.

౪
౨౦౫. పేదయనిదౌష్ట్యములఁబ్రకల్పింపరాదు
పేదయగుఁదామఱియుఁబ్రకల్పించెనేని.

౫
౨౦౬. అలదురంశములొరులచోసలుపరాదు
తనురుగంశములడఁపఁగోరనియతరండు.

౬
౨౦౭. ఎట్టిపగఁగన్నవారుమండ్రెట్టెటోయల
చెట్టుపగచెట్టులేకవెన్నుట్టిచంపు.

౭
౨౦౮. చెలుపొనర్చినవారలుజెడుటనీడ
తనుఁదొలంగకయడుగునఁబొనరినటుల.

౮
౨౦౯. తన్నుఁదాఁగోరువాఁడేనితనుమిఱియును
బన్నఁగారాదుదుష్కృత్యభాగమొకఁడు.

౨౧౦. అరిదిచేడ్పాటువాఁడనునదియెఱుఁగుతఁ
బొరుగుగా నేగిదుష్కృతుల్ జరపఁడేని. ౧౦

22 త్రివర్గము - ధర్మకాండము.

౨౨ వ అ - ము - ఆచారవిచారము.

౨౧౧. ప్రతికృతినిగాంక్షిలదుప్రతిపాదనంబు

జలదమునకేదిభువనముసలుపఁగలదు.

౧

౨౧౨. యత్నమొనరిచికూర్చినయర్థమెల్ల

సత్త్రములకుపకారముసల్పుటకయి.

౨

౨౧౩. బుభులజగతినినిటయును నెనయుటరిది

వితరణమువలెశుభదములితరములను.

3

౨౧ ౪.

విహితమెఱుఁగువాఁడుసుఱుతోవెలయువాఁడు

౭౮౧. చేయుటకసాధ్యములు చెల్మి చాయ నెవ్వి
చేఁతలకసాధ్యతరరక్షలౌ తెలఁగెవి.

౭౮౨. సాధువుల చెల్మి బాలేందు జాడఁ బెరుగు.
బామరుల చెల్మి పూర్ణేందు భాతిఁ దఱుగు

౭౮౩. చదువునంతకు నొప్పును శాస్త్రసుఖముఁ
గలియునంతకు సద్గుణస్థులతో డరిక.

౭౮౪. సంతసిలుటకై కాదు నేస్తంబది మఱి
మించు దలలపైఁ జేరి ఖండించుటకయి.

౪

౭౮౫. కూఁడికయు వాడుకయు వృథఁగొనును దెల్వి
తానొలయ నేస్తమొలయు సొంతంబునిచ్చు.
౫

౭౮౬. వక్త్రిమలరఁ బొందెడుఁ బొందు వట్టిపొందు
చిత్తమలరఁ బొందెడు పొందు చెడనిపొందు.
౬

౭౮౭. చెఱుపులను దీర్చి దారిని జేర్చి చెట్ట
తగిలినటఁ బీడఁ బీడితుఁ డగుట చెలిమి.
౭

౭౮౮. అంశుకము వీడి నాతని హస్తమటుల

నత్తఱినబాధఁదీర్చునదగును మైత్రి.

౮

౪౮౯. ప్రేమకాస్థానమెదియన్న బెళకులేక
యొప్పునాస్థానములనెల్లనూనుదృఢత.

౯

౪౯౦. ఇంతటిరువీరుమాకిట్టిరేమునాన
లంకరణమాడనాడునల్పతనుజెల్మి.

౧౦



౫౦-వ అ-ము-స్నేహవిచారణ.

౪౯౧. ఆరయకస్నేహమగునటులవిధిలేదు
స్నేహమయిలేదువిడుగడస్నేహితులకు.

౧

౭౯౨. అరసియరసికావింపనియతనిచెలిమి
చరమముననుదాఁజచ్చుదోసంబునిచ్చు.

౨

౭౯౩. గుణముకులముదోసముకొఱఁగొననివియ్య
మరసియెఱిఁగిస్నేహముఁగొననగునొకండు.

౩

౭౯౪. కులమునజనించితనపట్లఁగుత్సఁదలఁకు
నతనివెలయిచ్చియునుసఖ్యమగుఁగొనంగ.

౪

౭౯౫. పడ్వఁబలికికానిదిపట్లనేఁచియునల

వాటునెఱుఁగఁబ్రోడలఁబొందువడుతమరసి. ౫

౭౯౬. క్షయమునందునుగలదొకనయముబందు
వులనుగుందకకొలిచెడియొక్కకోల.

౬

౭౯౭. లాభమనునదియొకనికల్పజ్ఞులకడ
నైనచెలిమినిదొఱఁగిపోనాడుటయగు. ౭

౭౯౮. తలఁపకుఁడుతలంపులకొఱఁతలిడువాని

వలవకుఁడు వెతందో౽ఁ గెడువారి చెలిమి.

౭౯౯. చెఱుపుతఁజేఁదో౽ంగెడు వారి చెలిమిజముఁడు

మడుపుతఁజేఁదలంచినఁగాల్చుమానసమును.

౮౦౦. ఒరయుతమకల్మషులసఖ్యమొండొ౽ఁగియు

నుడుగుతమయుక్తులసఖిత్వమొందరేని. ౧౦

త్రివర్గము - అర్థకాండము. 81

౮౧-వ అ-ము-ప్రత్నత.

౮౦౧. ప్రత్నమను బెయ్యదన్ననుస్వల్పమునుస్వ

తంత్రతఁదిరస్కరింపక తలఁచు చెలిమి.

౧

౨౦౨. స్నేహమునకంగమగు స్వతంత్రించుటమతి

దానికిఁబ్రియంబువడుట పెద్దలక్రమంబు.

౨

౨౦౩. పనుపడిన చెల్మియేదిసల్పును స్వతంత్ర
తను సలిపినట్లు తాముబాధ్యపడనికడ.

౩

౨౦౪. చెల్మితగవునఁ జేయిదనిచ్చించియుండ్రు
సొంతతగవుననడుగక సుహృదులిడిన.

౪

౨౦౫.
బాలిశతయొండొ సుహృదులొప్పనివియిడినఁ
జాలనగుసొంతమనిగ్రహించంగనగును.

౫

౨౦౬. తటమునందున్నవారలుదగ్గకడను

దరమునందున్నవారి నేస్తంబుడుగరు.

౬

౮౦౭. కష్టగతులఁగూర్చినను సఖ్యంబునుడుగ
రిష్టగతినిగూరిన సఖిత్వైకపరులు.

౭

౮౦౮. హితులతప్పువిననినిష్టాంత మెఱుఁగుకృతికి
దినముదప్పుసుహృదులుంచిననదియగును. ౮

౮౦౯. చెడనిదారినివచ్చిన చెలిమి కాంగ్ర
చెలిమివీడనిమర్త్యులవలచుజగతి. ౯

౮౧౦. పరులచేఁగోరఁబడుదురుప్రతనులకడ
గుణము చే భేదనముఁగయికొననివారు. ౧౦

11



౮౨-వ అ-ము - దుష్టసఖ్యము.

౮౧౧. అనువారినొప్పినగుణహీనజనుల
స్నేహమారుకం టెనుబసచీకుఁగనుట.

౧ ౮౧౨. పడసీనను జేరియెడసినఁబాయుసదృశ
విరహితులకూర్మి పెరిగినవిఱిగిననెది.

౨

౮౧౩. పొసఁగుదానిఁదూఁచెడుమిత్రులొసఁగుదాని
గొనెడువారుచోరులుదుల్యులనఁదగుదురు.

౩

౮౧౪. రణములోఁగతివచ్చునేరనితురంగ
సములప్రేముడికంటెనుసౌఖ్యమొంటి.

౪

౮౧౫. సల్ప్రియునుబ్రోపునందనిజాల్ములయల
చెట్టచెలిమాటకంటెమంచిదగుఁగామి.

౫

౮౧౬. అజ్ఞుకడఁగ్రిక్కిఱిసినసఖ్యంబుకంటెఁ
బ్రాజ్ఞుపగలక్షశతములపాల్గుసుఖము.

౬ ౮౧౭.

హాసపరులుగానైనసఖ్యంబుకంటె

ద్వేషపరులచేఁగోట్లయంతేసినసుఖము.

౭

౮౧౮. వచ్చుపనివికల్పమొనర్చువారిచెలిమి

ముచ్చటిడకకొంచెముగొంచెముగనుడుగుత.

౮

౮౧౯. స్వప్నమందునుజెట్టయాసలుపుటాండు

వలుకుటాండగుమర్త్యులబాంధవంబు.

౯ ౮౨౦. ఎంతయునుడగ్గఱించుటనెడపుఁడింట

వర్తిలిసమజ్యఅట్టిడువారితోడును. ౧౦

త్రివర్గము - అర్థకాండము. 83

౮౩-వ అ-ము-అనర్హాసఖ్యము.

౮౨౧. తగినకడఁగన్ననడపనుదాకలియగు

వసముగనకుండికలిసినవారిపొందు.

౧

౮౨౨. చుట్టలటయిచుట్టలుగానియట్టివారి

చెల్మియబలలుల్లము మాడ్కి౯ఛిదగొదఁబడు.

౨

౮౨౩. వివిధభద్రములనుజదివినయపుడును
హృదయభద్రగులగుటదుర్హృదులకరిది.

౩

౮౨౪. వదనమునవుంచిగనునవ్విహృదయమ్మునను

చెఱుపుగలవంచకుల కెప్డు వెఱవనగును.

౪

౮౨౫. ఎడఁదవలనఁగూడనివారి నేమొకటను

బలుకువలనఁదేఱుటకాదుప్రక్రమంబు.

౫

౮౨౬. హితులమాడ్కి౯బాగులవచియించిరేని

నరులమాటలాశుగఁదెలియంగఁబడును.

౮౨౭. పలుకవినయముశాస్త్రవస్థలిఁగొనకుఁడు
ధనువువినయముగీడుదెల్పినకతమున.

౭

౮౨౮. దండమిడినకేలుననుశస్త్రంబణంగు
శత్రుజనములేడిచినయశ్రంబునలది. ౮

౮౨౯. అడరఁజేసితమ్ముహసించునట్టివారి
నగనుజేసిచెల్మిఁజెడంబెనఁగుటక్రమము ౯

౮౩౦. వైరులిష్టులౌనలప్రొద్దువచ్చునప్డు
డాస్యమొప్పిస్వాంతముదప్పియదితొఁలఁగుత. ౧౦

84 త్రివర్గము - అర్థకాండము.

౮౪ - వ అ - ము - అజ్ఞత.

౮౩౧. అజ్ఞతయనంగఁబడునదొండదియొదన్నఁ
జెట్టలగ్రహించిఫలముఁబోఁగొట్టడిదగు.

౧

౮౩౨. మౌఢ్యములలోననంతయుమౌఢ్యమగును
లాలసనయోగ్యవృత్తులపాలఁజేఁత.

౨

౮౩౩. త్రపఁబడమిచర్చఁగొనమిహార్దంబులేమి

యెదియొకఁడుమన్నమియును వైధేయపనులు.

౩

౮౩౪. చదివి తెలిసియన్యులనని సభనణఁగని
యలమడియనికన్నను మడియలుగలుగరు.

౪

౮౩౫. ఒంటసలుప నేరుపరివేడింటియందుఁ
జొచ్చియణఁగు నారకమునజ్ఞుండుదాను.

౫

౮౩౬.

పొరఁబడుటయొండొనిగళముఁబొరయుఁడాను
వగనెఱుఁగకజ్ఞుఁడొకపనిఁబయికొనినను.

౬

౮౩౭. దుర్వ్యాధులునిండక్షుధితులౌదురుసుహృత్తు

లజ్ఞుఁడురువొందుకలిమిఁదానానినయెడ.

౭

౮౩౮. భ్రాంతుఁడొకటిఁడుసురమత్తుఁబడసినగతి

మూర్ఖుఁడొకరుఁడుతనహస్తమునఁబడసిన.

౮
౮౩౯. చాలనింపువైధేయులసఖ్యములవి

యోఁగమప్పుడాభీలదమొండులేమి.

౯
౮౪౦. కడుగనిపదంబుశయ్యపైనిడినయటుల

విబుధులసమజ్యనజ్ఞుప్రవేశమగును.

## ౧౦ త్రివర్గము - అర్థకాండము.

85

### ౮౫-వ అ-ము - అల్పజ్ఞత.

౮౪౧. ఎఱుకలేమిలేమినిలేమిపెఱదిలేమి
జగతివారులేమిగఁజూడఁజాలరట్టు.

౧
౮౪౨. ఎఱుకలేనివాఁడెదఁబొంగియిచ్చుటకొను

నతనినోములేదుని మిత్రమన్యమెదియు.

౨
౮౪౩. అజ్ఞులగువారుదామదమ్మలఁచునలఁత

శత్రులకుఁగూడఁజేయనసాధ్యతరము.

3

౨౪౪. వెలరదేదనఁగా వెల్లుఁగలజనులము
మనమునాఁదముఁదా మెంచుమానమగును.

౪

౨౪౫. తెలియనివిపయికొనిప్రవర్తిలుటదోష
మెడపుకుశలతఁగలదియునిచ్ఛ్వశంక.

౫

౨౪౬. అవయవముఁదాఁచుటోయగునల్పబుద్ధి
తమకడనుదోఁచుదోసముల్ దాఁచనిగతి.

౬

౨౪౭. అరిదిమంత్రముపిడనాడునల్పబుద్ధి
పెనువెతంగయికొనఁజేయుఁదనకుఁదాన.

౭

౨౪౮.
పనుపనునొనర్పలేఁడుదాను నెఱుఁగఁడగు
నలయునుఱుపోవుదాఁకనొకామయంబు.

౮

౮౪౯. చూడనతనిఁజూపునతండుచూడనతఁడు

చూడనతఁడుచూచినతండుచూచినటులు.

౯

౮౫౦. సాధువులుగలదనుదాని లేదనియెడు

నాతఁడునుపఁగఁబడుధాత్రిభూతముగను.

౧౦



౮౬ - వ అ - ము - వైరము.

౮౫౧. వైరమనుదుర శేషజీవంబులకును
భేదమనుగుణహీనతఁబెంచుగదను.

౧ ౮౫౨. భేదముఁదలంచికానివిపేరిదినను

వైరముఁదలంచికీడుఁగూర్పమిప్రముఖము.

౨

౨౫౩. ద్వేషమును వేదనగదంబుఁదీటిచినను
నాశమది లేమిగస్థిరప్రకాశమిచ్చు.

౩

౨౫౪. సౌఖ్యమునసౌఖ్యమొసఁగుద్వేషంబనియెడు

దుఃఖమునదుఃఖమొకనికిఁద్రుంగి నేని.

౪

౨౫౫. వైరమెడనోరగిలినడువంజతురుల
పైనిజనిపోరఁదలఁచుస్వభావులెవరు.

౫

౨౫౬. వైరమునఁబేరుటితవనువానిబ్రదుకు
జాఱుటయుఁదీఱుటయునుబజ్జంగలయది.

౬

౨౫౭. హెచ్చుటనుగాంచుసత్యార్థమెఱుఁగ లేరు
నుచ్చరముఁగాంచుమశ్శీలమతులుదాము.

౭
౨౫౮. ద్వేషమందుఁబ్రక్కఁగునయ్యదిసిరిదాని
మీఱనుద్యమించిననుద్యమించుఁజేట్ట.

౮
౨౫౯. ద్వేషమెఱుఁగఁడుసిరివచ్చువేళదాని
ప్రాయమెఱుఁగునుగడగండ్లువచ్చుటకయి. ౯

౨౬౦. ద్వేషముననగుఁజెట్టలశేషముమఱి
హాసముననగుప్లన్నయమనుప్రమదము. ౧౦

## ౮౭-వ అ-ము - శాత్రవసమృద్ధి.

౮౬౧. బల్లిదులకెదురొడ్డుటఁబాయుతమఱి

దుర్బలులపయినెప్డుఁగుదుర్చుతపగ.

౧

౮౬౨. హార్దమదికానఁడురుసహాయతఁగనండు

దానుబలహీనుఁడెటులుద్విడ్దర్పమడఁచు.

౨

౮౬౩. భీతిలునెఱుంగఁడోరిమిఁకఁబెట్టఁడీవి

తోమెలఁగఁడిట్టిఁడరులకుదొడ్డపేద.

౩

౮౬౪. ఎడయఁడలుకఁజెందఁడునెఱవితనిపైని

జనుటసులభమెవ్వరికినెచ్చటనునెపుడు.

౪

౮౬౫.

పథముఁగనఁడుప్రాప్యములౌనర్పఁడుదనకగు

నగడుఁగనఁడుబూనఁడుగుణంబరులకింపు.

౫

౮౬౬. కాననియమర్షుఁడతిసాంద్రకామివీరి

కోరమిపక్షతతిచేతఁగోరఁబడును.

౬

౮౬౭. ఒసఁగియుంగొనునదివలయునుగరంబుఁ

దోణఁగియుండితగనివిచేయునతనిపగ.

౭

౮౬౮. గుణవిహీనుఁడైతప్పులెక్కుడుగనైన

హితవిహీనుఁడౌనద్దిద్విట్తతికిఁదోడు.

౮

౮౬౯. అడుచువారికున్నతపుసౌఖ్యములుడుగవు

తెలివిలేనిశంకిలెడుశత్రులఁబడసిన.

౯

౮౭౦. పతనశూన్యునిగినియుస్వల్పమగునొడమెఁ

గొననియాతనిఁగొనదు వెల్గునిరతమును. ౧౦



౮౮ - వ
అ - ము - శాత్రవగతి నెఱుఁగుట.

౮ ౭౧. శాత్రవంబను గొడవఁగూర్చఁగలది యొకఁ
డాటల ం దునువలచుయోగ్యంబు కాదు.

౧
౮ ౭౨. కార్ముకహాలకర్షకులపగంగొనినను

భాషణహాలకర్షకులకోపముఁగొనకుడు.

౨
౮ ౭ ౩.
భ్రమఁగొనినవారికంటెనాఁబంజయొంటిఁ

గనిపగయ నేకులందు తాఁగాంచువాఁడు.

౩
౮ ౭౪. పగను జెల్మిగఁగొనివర్తిలుగుణవంతు

తగవుపట్లను నెలకొన్నదగును జగతి.

౪

౮౭౫. తనకుఁదోడు లేదిరుపగల్దానొకఁడగు

టనగుతోడుగాఁగొనుతమందెనయునొండు.

౫

౮౭౬. తేటినను చేటకయయున్నఁ దెగుదలకడఁ

దేటఁడయిపాయఁడయిమధ్యఁదిరుగవిడుత.

౬

౮౭౭. నొవ్వవలదునొచ్చినదికన్గొననిచోట
తగ్గవలదుతగ్గును గొనఁదలఁచుచోట. ౭

౮౭౮. గతినెఱిగితన్నుసల్పితన్గావఁగఁదన

పగతు రెడఁగల్గినట్టిదర్పమునశించు.

౮

౮౭౯. చిలుతగనెకంటకద్రుముఁజిదుముతమది

చిదుముఁగలుపెత్తుమర్త్యులచేముదిరిన.

౯

౮౮౦. ఊపిరాడను గలరుగారు అవ్వగఁబగ

వాడు వారల మదము నార్పని మనుజులు, ౧౦



౮౯ - వ అ - ము - అంతర్వైరము.

౮౮౧. చాయజలము దుష్టములు దుష్టములు బంధు
స్వాంతగతులు దుష్టములు దుష్టముల నిడిన.
౧

౮౮౨. అసినిబోలు శత్రుల పగ కలుక కుండుసు
హృదులఁబోలు శత్రుల తొడరిక కలుకుఁడు.
౨

౮౮౩. లోపగకుజంకి తన్ను నేలు తఁగులాలు

సానగతినెంతయునుగూల్చుసద్గుదలను.

౩

౮౮౪. హృదయనయమీనిలోపగనొదవెనేని

స్వజననయమీనిదోషపుంజములనిచ్చు.

౪

౮౮౫. చుట్టములచేతలోపగపుట్టెనేని

నత్యయముతోడదోసములన్నియిచ్చు.

౫

౮౮౬. పొసఁగమిపొసంగినజనాళిదెసఁగలిగిన
మడియమిపొసంగుటరిదియెన్నఁడునృపునకు.

౬

౮౮౭. బరణిపొందటులూరిమిననోరుమరంత
రపురిపుత్వముఁగనినగోత్రంబువారు.

౭

౮౮౮. ఆకుజాయిరాయఁగఁభిండమటులబలము

తేయురాసిలోపగఁగొన్నదియగుకొలము.

౮

౮౮౯. నూపగులునొప్పినట్టితనుమితిదేని
లోపగతదంతరంబుననాపదయగు.

౯

౮౯౦. సమ్మతములేనివారిసంసర్గముకుటి
యందుఫణితోడఁగూడియున్నట్టివిధము. ౧౦





## ౯౦-వ అ-ము - పెద్దలనవమానింపమి.

౮౯౧. బల్లిదులబలంబపహసింపమిమనిచెడు
నట్టిజనులమన్నుటలయందంతయుఁదోలి.

౧

౮౯౨. బల్లిదులలక్ష్యమిడకప్రవర్తిలినను
బల్లిదులవల్లనెడయనిబాధనిచ్చు.

౨

౮౯౩. చెడుటవలసినఁగావింపుఁడడుగక అల
నడుపవలసినసాధించు నాజను లెడ.
౩

౮౯౪. జమునిఁజెయిఁగొనిపిలిచినక్రమముఁగలది
బలులకబలులుచెఱుపులువన్నెడునది.
౪

౮౯౫. ఎందరిగిరొందునునికిఁదామందలేర

సహ్యాబలపృథ్వీపులక్రుధాసంకలితులు.
౫

౮౯౬. అగ్గిఁగాల్పఁగాఁబడినమన్నగునుమనరు

సజ్జనాపరాధులుగనైజరగువారు.
౬

౮౯౭. సాంగమహితజీవనముమహార్థమేది
యోగ్యమహితపూజ్యులుక్రుధనొందిరేని. ౭

౮౯౮. తిప్పయట్టిరుదిసడుగాఁదిట్టిననిల
నొప్పినట్టిరుకొలముతోనొగిఁజెడుదురు. ౮

౮౯౯. ఘనతఁగలవ్రతోద్యుక్తులల్గిననడుమను
దునిసిపడిపదభ్రష్టుఁడౌదేవాధిపతియు. ౯

౯౦౦. ఘనతనమరినయానిక ంగలరయినను

౯౧-వ అ-ము-కామినిగతిచేరుట.

౯౦౧. గృహిణిఁగోరు వారందరగ్రియఫలముఁజే
యువును గోరు వారొల్లని యొుడమియునది.

౯౦౨. పూనకబలను గోరెడువానిసిరియ
నూనముగునొకహ్రీయయిహ్రీనొసంగు.

౯౦౩. గృహిణిచెంతలొంగినగుణహీనతనుచ
రితులచెంత నెల్లపుడునుహ్రీడనిచ్చు.

౯౦౪. భార్యకలెక్కడుపరలోకఫలవిహీను
కార్యనిర్వహణముకీర్తికరముగాదు.

౧

౨

౩

౪

౯౦౫. జాయకలుకువాఁడలుకును సంతతంబు

సాధువులకుశ్రేయములను సలుపుటలకు.

౫

౯౦౬. అనిమిషులమాడ్కిఁబ్రదికినఘనతఁగనరు

గృహిణిమృదుదోర్లతలకుజంకెడుపురుషులు.

౬

౯౦౭. కన్యపను పెంచివర్తింపఁగలపురుషత

కన్నఁద్రపఁగాంచుకన్యయఘనతఁగలది. ౭

౯౦౮. సఖులకొఅలముగింపరుసత్కృతులను
సలుపరతివప్రియంబటుజరగువారు. ౮

౯౦౯. పుణ్యకృతియుఁబూనినశ్రీయునన్యకృతియు

నింతిపనుపుఁజేసెడువారిచెంతలేదు.

౯

౯౧౦. తలఁపుఁగనినయెడందశ్రీకలుగువారి

కతివఁగనియగుమాఢ్యమెట్టితఱిలేదు.

౧౦



౯౨-వ

అ-ము-నియమరహితాంగనలు.

౯౧౧. ప్రీతిచేఁగోరకోరునిశ్రీచేతఁగోరు

కూటవేషాంగనలనమోక్తులువెతనిడు.

౧
౯౧౨. ఫలమరసిభవ్యమాడునభవ్యనార్ల
నయమరసియెంచివారిఁబొందకవిడుచుత.

౨
౯౧౩. గడనకత్తెలయనృతసంగమముచీఁక
టఱనెఱుంగనికుణపమునంటినటులు.

౩
౯౧౪. అర్థపరమార్థలతనుసౌఖ్యముఁగొనరను
కంపపరమార్థమరయువిజ్ఞానపరులు.

౪
౯౧౫. సర్వజనభోగసక్తలస్వల్పసుఖముఁ
జిత్తశుభభోగవిజ్ఞులుచెందఁబోరు.

౫
౯౧౬. తమసుఖమునించువారలుదాఁకరమ్మి
త్రుటిసుఖమునించుమోహపలదోర్లతలను.

౬
౯౧౭. నిలుపెడఁదలేనివారుదామొలయఁగలరు
పెఱలెడఁదఁగోరిచేరుభావినిభుజములు.

౭

౯౧౮. తెలియుప్రాజ్ఞులుగానివారలకుపధివ
నితలకౌఁగిలిమోహినీయుతమనుదురు.

౮

౯౧౯. నేమహీనరామలమెత్తనివగుకేలు
జ్ఞానహీననీచులుమున్ననానిరయము.

౯

౯౨౦. ఉభయహృదయాంగనలుసురద్యూతమునివి
సిరివలనఁబాపఁబడినయానరులకితవు.

౧౦



౯౩-వ అ-ము-కల్లుద్రాగమి.

౯౨౧. అలుకనీరుతేజుడుగుదురనవరతము
మదిరపైనిలాలసఁగొనిమరగువారు.

౧

౯౨౨. త్రాగకుఁడుకల్లుఁద్రాగినఁద్రాగుఁడార్య

పూజనమునొందఁగోరమిఁబూనువారు.

౨ ౯౨౩. కన్నమకుముందుఁగానిది కావునగుణ
ధన్యులకుముందు నేమికాదంబరిభ్రమ.

౩ ౯౨౪. వ్రీడయనెడియుత్తమురాలువెన్నొసంగు
పాలయనెడితొప్పనిదోషపాలకులకు.

౪ ౯౨౫.

చెయువెఱుంగమిఁగలయదిక్రయమొసంగి

తొడలెఱుంగమిఁగొనునదితొకరుండు.

౫

౯౨౬. తూఁగినారుకూలినవారితుల్యులెపుడు

పాలనానువారలుత్వేళమానువారు.

౬

౯౨౭.

మఱుఁగెఱిఁగియుండుగ్రామసంహాసితులౌదు

రెపుడుసురడొంగియానిమత్తేనయువారు.

౭

౯౨౮. మత్తిలిమెఱుంగననుటనుమానుతహృద

యస్థలిమఱుంగిడినదియునౌబయలగు.

౮

౯౨౯. హాలమత్తుహేతువెఱుంగనాడుటపెను
నీటమున్గినాతని దివ్వెనెమకినటుల.

౯

౯౩౦. ఇరఁగుడువకుండిభ్రాంతివహించినతనిఁ

గనఁదలఁచఁడౌ క్రొత్తత్రాగినతనసొలపును.

౧౦



## ౯౪-వ అ-ము - ద్యూతము.

౯౩౧. వలవకుఁడుగెలిచిననక్షవతిగెలిచిన
దియుబడిశముఝషముమ్రింగినయనువగును.

౧

౯౩౨. ఒకటిఁగొనినూఱుదిగనాడుద్యూతకులకు
శుభముఁగొనిమీఱునొకదారిచొప్పడునొకొ.

౨

౯౩౩. పొరలునాయమునుఘుగకప్పూనియఱవ
ధనమునాయముఁజనిపరస్థలినపడును.

౩

౯౩౪. వ్యథలుమిగులంగఁగూర్చిశ్రేయంబుఁదీర్చు
పణమువలెనొండులేమియిచ్చునదిలేదు.

౪

౯౩౫. కైతవముకూటములవాటుఁబ్రీతిఁజేసి
కైకొనినపార్థివులులేనికథలవారు.

౫

౯౩౬. కడుపునెరపలేరంగదల్ గందురుపణ
మనెడునిర్వృతిచేఁగప్పఁబడ్డట్టివారు.

౬

౯౩౭. పనుపడినసంపదనుగుణంబును జెఱచును
సమయమదియక్షవతికడంజరగెనేని.

౭

౯౩౮. ధనముఁజెఱిచిదబ్బరఁబయిఁదార్చిమెడఁదఁ
గరుణఁజెఱిచికష్టమునునెగడ్చుఁబణము.

౮

౯౩౯. కాంతివిద్యసంపదబువ్వకీర్తిడునవి
యైదునెత్తమందిననందవటనృపునకు.

౯

౯౪౦. చెడుదనుకనుగోరుపణంబువడువునవెతఁ
బడుదనుకనుగోరుగుణంబుప్రాణమందు.

౧౦

త్రివర్గము - అర్థకాండము.

95

౯౫-వ అ-ము-ఔషధము.

౯౪౧. హెచ్చిననుదగ్గిననురోగమిచ్చుశాస్త్రి
లెత్తినమరుత్తుమొదలైనయత్తిగయును.

౧

౯౪౨. భేషజంబనివలదటవిగ్రహమున

కారగించినదఱిగినదరసితిన్న.

౨

౯౪౩. అఱిగినఁగొలందిచెఱిఁగితానుతమది
మొదలుగొనినట్టిఁడుపలునాళ్లనుచుదారి.

౩

౯౪౪. అఱిగినదెఱింగిప్రతిలేనియవిగుఱిఁగొని
కుడుచుతబుభుక్షఁబెనుపారఁగొనిమొకండు.

౪

౯౪౫. వ్యత్యయములేనినిఘసమువదలితిన్న
నత్యయములేదుగదమునసువులకును.

౫

౯౪౬. సుంతఁగనిమెక్కువానిచోసుఖముమాడ్కి.
నిండుపెనుతిండివానిచోనిలుచుగదము.

౬

౯౪౭. అగ్గికొలఁదికాకెఱుఁగకయతిగఁదిన్న
రుక్కుకొలఁదిలేకతనికిఁబిక్కటిలును.

౭

౯౪౮. వ్యాధినరసివ్యాధికిమూలమరసిదాని

శాంతిపథమునారసికూడఁసలుపుఁగాక.

౮

౯౪౯. ఆతురుకొలందిమఱియామయముకొలంది
కాలముఁదలంచితగఁజేయుఁగావుతకృతి.

౯

౯౫౦. గదగుఁడుచికిత్సకుఁడుమందుతదుపచరణ

పరుఁడనుతదంశచతురంశపదముమందు.

౧౦



## 3 - వ ది - శే ష ప్ర క ర ణ ము.

### ౯౬-వ అ-ము-కులీనత.

౯౫౧. కులజనితులందుఁగాకప్రగుణతనాన

కలయసహజంబుగాఁబొసంగవారలందు.

౧

౯౫౨. వృత్తమును సత్యమును హ్రీయు వెలయునీత్ర
యంబునఁదొలంగరుకులీనులైనవారు.

౨

౯౫౩. హాసమీగిప్రియోక్తిదూఱాడకుంట
నాల్గుసూనృతగోత్రనిర్ణయములండ్రు.

౩

౯౫౪. పేరిచినవిగఁగోటిగఁగూరి రేని
గోత్రజనితులు సేయరుకుందుఁగలవి.

౪

౯౫౫. ఇచ్చునదిలోపలఁబడంగవచ్చినటను
విచ్చునది లేదుగుణమందువృద్ధకులము.

౫

౯౫౬. చలముఁగొనియొప్పఁగననివిసలుపరమల
కులముఁగొనిమందమనితలకొనెడువారు.

౬

౯౫౭. గోత్రజాతులకడఁదప్పకొలుదివిని

నోషధీశునికడమచ్చమెూజహెచ్చి.

౭
౯౫౭. నయముపట్లనప్రియతకన్నడినవానిఁ
గులముపట్లసంశయమునుగొనుజగంబు.

౮
౯౫౯. క్షేత్రగుణమును మొలకలుసెప్పఁజెప్పు
గోత్రజనితులవదనవాక్కులటువలెను.

౯
౯౬౦. శివముఁగోరినఁగోరుతసిగ్గువినతిఁ
గులముఁగోరినఁగోరుతఁబలుగురికడ.

౧౦



౯౭ - వ అ - ము - మానము.

౯౬౧. లేకయమరనివిభవాకలితమున్నైనఁ

బాయవలెఁగొఱఁతనుజేయవచ్చువాని.

౧

౯౬౨. శ్రీకరములోనుఁజేయరశ్రీకరముల
శ్రీకరముతోడమానమిచ్చించువారు.

౨

౯౬౩. వృద్ధియందునమ్రతవలెకొద్దిదైన
తగ్గునందుఁబెద్దఱికముదాలుపవలె.

౩

౯౬౪. శిరమువదలిక్రిందనుబడ్డచికురసములు
తరమువదలిక్రిందనుబడ్డతఱినిజనులు.

౪

౯౬౫. కొండసమమానినారలుంగుందుదురొక
గుంజసమమానఁజేసినంగుందుగలవి.

౫

౯౬౬. యశమునొసఁగదుత్రిదివమునందనీయ
దెదిమొమఱినగుజనులవెన్నెగినిలుపు.

౬

౯౬౭. కొననివారలవెనుచనిమనుటకంటె

నణఁగెనాఁబడునదిసుఖంబాయునికిన. ౭

౯౬౮. మందోమతిమాంసమునొకండుమన్నుబ్రమకు

హెచ్చుచెడిమానములయింపవచ్చినపుడు.

౮

౯౬౯. తనురుహముపీడినన్బ్రదుకనిచమరస

దృశులుసుఖుపీడుదురుమానమెడయఁగన్న.

౯

౯౭౦. హీనతలభింపబ్రదుకనిమానపరుల

తేజముఁదలంచిజగతినుతించునెపుడు.

౧౦





౯౮-వ అ-ము. గౌరవము.

౯౭౧. తేజమొకనికిహృదయౌన్నతివిలసిలుట

హైన్యమొకనికినదిమానియాదమనుట.

౧

౯౭౨. ప్రభవ మొప్పన శేషజీవంబులకును
విభవ మొప్పదు చేయుకృత్యాభిదవలన.

౨

౯౭౩. ఎగువనున్న నెచ్చుడిగినా రెచ్చుకారు
డిగువనున్నడిగ్గుడిగినార్డిగ్గుకారు.

౩

౯౭౪. పుణ్యసీమంతినులవిధంబునఁ బెరిమెయుఁ
దన్నుఁదామంచినదుఁచుటఁగన్నఁగలదు.

౪

౯౭౫. పెరిమెఁగలవారొనర్తురు పేదలయ్యు
గరిమగలచేఁతలందొఱఁగక తెరువున.

౫

౯౭౬. పిన్నలమనంబునను లేదు పెద్దలనుస
మున్నతిగఁగొందమనఁజాలురొహాచనయది.

౬

౯౭౭. మించుదలలో నెకడుఁబ్రసరించినదగు

మంచిదియుఁదాననుచితులపంచఁబడిన.

౭

౯౭౮. గొప్పతనమెప్పునణఁకువఁగొనునలంక

రించుఁదనుసంతసిలియదికొంచెతనము.

౮

౯౭౯. గొప్పతనముగర్వము లేమిఁగొనినడుచుట

కొంచెతనముగర్వము నాచుకొనినిలుచుట.

౯

౯౮౦. న్యూనతనుసముత్కృష్టత కానసీచు

హీనతనెయనుత్కృష్టతయెన్నివిడుచు.





౯౯-వ అ-ము-సమృద్ధికలిమి.

౯౮౧. సహజమంద్రుమంచివియెల్లసహజమెఱఁగి

యభిసమృద్ధినొందిచరించునాజనులకు.

౧

౯౮౨. గుణశుభమెపూర్ణులశుభమగుఁబెఱిలనను

నలశుభమదేశుభముననుగలదికాదు.

౨

౯౮౩. ప్రీతిప్రీడదానమునాగరికతబుతము

గూడనేనుఁబూర్ణతఁగొన్నగుంజలగును. ౩

౯౮౪. త్రుంపనిశుభస్థమదినో మొరులయఅవచి

యింపనిశుభస్థమదియాసమృద్ధియగును.

౪

౯౮౫. అలసమర్థులసామర్థ్యమణఁకువయది

యభిసమృద్ధులద్వేష్యభిదాయుధంబు.

౫

౯౮౬. అభిసమృద్ధికిశాణమేదన్నవోటు

సమతనొందనివారియచ్చటనుఁగొనుట.

౬

౯౮౭. ఓగునిచినట్టివాండ్రకుంబాగునుపని

యాయెడసమృద్ధియేఫలంబార్చునదియొ.

౭

౯౮౮. లేమియొకనికిఁగాదు గేలితనముపరి

పూర్తియనఁగలసామర్థ్యమునుబొరసిన.

౮

౯౮౯. కల్పమదిగ్రకఁదలినఁగ్రకఁదలరభిస

మృద్ధికిఁదటంబనఁబడు మేల్మిఁగలవారు.

౯

౯౯౦. పూర్ణులుప్రపూర్ణతాశయంబుఁగొనిరేని

ప్రాజ్యజలధాత్రితాభరింపదుభరంబు. ౧౦

౧౦౦-వ అ-ము - గుణముకలిమి.

౯౯౧. సులభపదముననెవ్వరిచోనుగుణము
గలిమియనునడకొందుటసులభమండ్రు.

౧

౯౯౨. ప్రియముఁగల్గుటతగినయన్వయమునఁబొడ
ముటనురెండునుగుణముఁగల్గుటనునడక.

౨

౯౯౩. అంగమొప్పుటజనులనొప్పగుటలేమిఁ
బొందఁదగ్గగుణముననొప్పుటగునొప్పు.

౩

౯౯౪. నయముమఱిసుకృతంబునొనర్చినట్టి
ఫలయుతులగుణమెంచుఁబ్రపంచతలము.

౪

౯౯౫. నగవచటనుకానిదినిందపగయచటను
గుణములగునుపాడినెఱింగిచనుజనులెడ.

౫

౯౯౬. గుణముగలవారుకల్గికల్గునుప్రపంచ
మదికలుగదేనిత్రుంగునదణఁగినేల.

౬

౯౯౭. ప్రశ్నముఁబోల్పదనుఁగలవారలైన
వృక్షమునుబోల్దురునరగుణాక్షయగులు.

౭

౯౯౮. హితమిడకవర్ణయతతులనిడుజనులకు
గుణమిడనియట్టిరగుటయగుంజరము.

౮

౯౯౯. హర్షణసమర్థకులుగానియాజనులకు
సింధుమహాఘుస్రమునవేనిశింబడినది.

౯ ౧౦౦౦. ధర్మరహితుఁడానినమహాధనముసత్ప
యాస్సుచపకదోషమునవేఅయినయటులు.

౧౦ త్రివర్గము - అర్థకాండము. 101

౧౦౧-వ అ-ము - మేలులేనిసిరి.

౧౦౦౧. కనియెనిలునిండనైనపేఁగలిమిదానిఁ
దినకమృతుఁడయ్యెఁజేయనుండినదిలేదు.

౧

౧౦౦౨. వసువునగునంతయునని యొసఁగ కెంచు
భ్రమముననగుక్షుల్లకజనన మొకరునకు.

౨

౧౦౦౩. కూరుపును గోరి శ్రేయముఁ గోరలేని

పూరుషులతోఁబుభూమికి భారమగును.

౩

౧౦౦౪. మిగతగా నేదియిచట సంస్మృతిఁ గొనునో కొ
యొకరిచే వేఁడఁబడుట లేకుండినతఁడు.

౪

౧౦౦౫. దానమును భోగమును లేని మానవులకుఁ
చేరిచిన కోట్లు కలవేనిఁ బేదఱికము.

౫

౧౦౦౬. ఆమయము పెనుసిరికిఁ దాననుభవింపఁ

డీఁడొకఁడు తగుజనులకీపాడియతఁడు.

౬

౧౦౪౭. లేనివారికొండిడకుండువానిసిరియు

హేమనోజ్ఞయొంటిఁబలిక్రైనయటుల.

౭

౧౦౦౮.

అడుగఁబడనియాతనిసిరినడిమియూర

నిలుచుముసిడిమ్రానొకఁడుపండినవిధంబు.

౮

౧౦౦౯.

ప్రియతఁదొఱఁగితన్నునొగిల్చినయముఁగనక

కనినవెలుఁగుబొక్కసమునొందుజనులుపరులు.

౯

౧౦౧౦. యశముఁగలలక్ష్మణులదిష్టకృశతరార్తి

జలధరమువగ్రహముఁగొన్నజాడఁగలది.

౧౦.

## ౧౦౨-వ అ-ము-సిబ్బితికలిమి.

౧౦౧౧. చేతఁబట్టిసిగ్గునుగంటసిగ్గుమంజు
ళాస్యసచ్చరిత్రలసిగ్గులన్యములవి.
౧

౧౦౧౨. కూడుఁదాల్పుఁదక్కులుఁబ్రాణికోట్లకెల్ల
వేఱుగాదుమర్త్యులప్రోదివ్రీడకలిమి.
౨

౧౦౧౩. తరసలక్ష్మములుసుజులంతయుఁద్రపయను
భవుకలక్ష్మము నెఱవుకన్పట్టియుండు.
౩

౧౦౧౪. తొడవుగాదొమాన్యులకుహ్రీంతొడరియుంట
గదముగాదొప్రాభవగతియదికలుగమి.
౪

౧౦౧౫. ఒరులనిందయుఁదమనిందయుసరిగఁద్రపఁ
గొనుజనంబులఁద్రపకునిక్కయనుజగంబు.
౫

౧౦౧౬. వ్రీడ వెలుఁగువహింపక విపులజగతి

కాసపడరువహింపమహాపురుషులు.

౬

౧౦౧౭. విడుతురసువులఁ ద్రపఁగోరి విడరుత్రపను

నసువులకునయిత్రప నేలునట్టివారు.

౭

౧౦౧౮. ఒరులుసిగ్గొందుదానిసిగ్గొందఁడేని

వృషముసిగ్గొందుదానివహింపఁగలదు.

౮

౧౦౧౯. కులముఁగాల్చునడవడికుంచెనేని

శివముఁగాల్చుత్రపఁగనమివిలసిలీన.

౯

౧౦౨౦. త్రపమదని లేనివారివర్తనముకొయ్య

బొమ్మగుణముచేనసుభ్రమఁబూన్చినట్టులు.

౧౦

౧౦౩ - వ

అ - ము - కులముఁ జేయుగతి.

౧౦౨౧. చెయిద మొనరింప నేను నాచేయివదల
నను పెరి మెకంటె లేదుగణ్యంబొకనికి.

౧

౧౦౨౨. యతనమును నిండు తెల్వియు నెడు రెంటి
నిడు చెయువునంగుటుం
బమునిడుదయగును.

౨

౧౦౨౩. కొల మొనర్తు నేననెడియుక్కొ-నికిదైవ
మొడిబిగించి తాముసుపుగనుద్యమించు.

౩

౧౦౨౪.
సలుపక ముగింపుఁగొనుఁదానస్వాన్వయమును.
మసలక కడంకఁగొని చేయుమానవులకు.

౪

౧౦౨౫. దోస మొందఁ దైవంశముఁ జేసిబ్రదుకు
వానిఁజుట్ట మైచుట్టును శ్రోణితలము.

౫

౧౦౨౬. దండిపౌరుష మొకనికొఁదాఁబొడమిన

యింటికేలికతనముఁ జేయించుకొనుట.

౬

౧౦౨౭. ఆలమెడఁగూరులటుస్వకీయాళియెడను

మోయఁగలవారిపయిఁగనే మోఁతయగును. ౭

౧౦౨౮. కులముఁజేయువారికి వేళకలుగఁదగుట

నలఁతఁబూనిమానముఁదాముదలఁపఁజెడును.

౮

౧౦౨౯.
వెతకేకొనుషాత్రమొకొటఁ సంసృతినిదోష

వితతిఁగననీకదాఁచెడియతనియొడలు.

౯

౧౦౩౦.
బాధమూలముఁద్రుంపఁగాఁబడునుబట్టి

యూనుమేల్మిముగందుదాలేనికాలము.

౧౦

౧౦౪ - వ అ - ము - కరిసనము.

౧౦౩౧. తిరిగియునులాంగలమువెన్క దేజగత్తు
గనుకఁబలుపాట్లుపడియుముఖ్యంబుకృషియ.

౧

౧౦౩౨. కృషికులుప్రపంచకులకక్షకీలకసము
లదిసలుపకుండిచనువారినంతనోర్చి.

౨

౧౦౩౩. కృషిసలిపిమెక్కమనువారలెమనువారు
నతిసలిపిమెక్కవెనుపోవునరులితరులు.

౩

౧౦౩౪. పలుదొరలభూములనుగందురలతముదొర
కయికొనఁగనా కణిశలక్ష్మికారుణికులు.

౪

౧౦౩౫. అడుగరడిగినజనులకొండిడుదురుమఱుఁ
గిడకకృషియిడిమెసవెడువృత్తివారు.

౫

౧౦౩౬. హాళికులకుఁజేమణఁగుటన్మైనలేదు
కోరునదియువీడితిమనువారికునికి.

౬

౧౦౩౭. పలముదువ్వపాత్రిఁగనెండఁబడిననెరువు

పిడికెఁడొల్లకే ఫలియించుఁబెద్దయునట.

౭

౧౦౩౮. హలముకంటెబాగెరువగుంగలుపటుపయి

జలముకంటెబాగగునురక్షణముకృషికి.

౮

౧౦౩౯.

అరుగకొడయఁడుండిననేలయొరియుచుఁగడు

నతనిగృహిణిచొప్పునలోననలిగివిడుచు.

౯

౧౦౪౦. దీనులమనియూరకయుండుమానవులను

నేలయనెడుభామినికన్నగేలిసలుపు.

౧౦

## ౧౦౫-వ అ-ము-దారిద్ర్యము.

౧౦౪౧. నెవ్వమాడ్కి నెవ్వగయది నెమకిచూడ
నెవ్వమాడ్కి నెవ్వగయది నెవ్వయయగు. ౧

౧౦౪౨. పేదఱికమను నొక్క పాపిచను దెంచు
నాపరమును నిహంబును దోఁపనీక. ౨

౧౦౪౩. ప్రతనవంశభవము సుభాషితముఁ జెఱుచుఁ
దోగగ దుర్గతియ నెడియాడోహదంబు. ౩

౧౦౪౪. అన్వయమునఁ బుట్టినవారియటను లేమి
సొడ్డుఁ గనినపలుకులు దోఁచుసొలపునిచ్చు. ౪

౧౦౪౫. లేమియను నామనస్యములో మఱిమఱి
యేగిపడు నామనస్యము లెయ్యవియును. ౫

౧౦౪౬. సత్తు వెలయునర్థముఁ జాలఁ జదివియనిన
నిస్వవచనమర్థము లేనినిదలపడును. ౬

౧౦౪౭. ధర్మమది తోడరని నెవ్వ తాల్పకన్న
తల్లివలన నను బరునట్లు తలఁపఁబడును. ౭

౧౦౪౮. నేఁడును లభించునతితోయుకొక్క నిన్నయుననుఁ
గూలిచినయట్లు కడగండ్లఁ గొన్న నెవ్వ. ౮

౧౦౪౯. నిప్పులోనుఁ దూఁగుటయగు నెవ్వలోను

గన్నమాయు జేదొకటనుఁగడిఁదియగును. ౯

౧౦౫౦. అనుభవంబొరయనివారలంతయుఁదొఁలఁ
గనిదియుప్పునకును గాడికెనిలయంబు. ౧౦





౧౦౬-వ అ-ము-యాచన.

౧౦౫౧. వేఁడఁదగువారలనుగన్న వేఁడఁదగును
డాఁచినను వారికగుఁదప్పుతమకుఁగాదు.
౧

౧౦౫౨. అడుగుటొకనికిసుఖహేతువడిగినయవి
యిడుమపడమిగఁదనకావహిల్లునేని.
౨

౧౦౫౩. డాఁచుటయదికానని చిత్తధర్మవిదుల

బ్రోలనిలిచియాచ్ఞయునొక్క మురువుఁగలది. 3

౧౦౫౪. అడుగుటయునిచ్చుటయుపోలనగును గోప
నమునుగలయందుఁగన లేనినరులయందు.

౪
౧౦౫౫. దాఁచునది లేనివారుభూస్థలినిగలిమి
జోఁకఁగొని చేరిమార్గణుల్ మేకొనునది.

౫
౧౦౫౬. దాఁపుడనురుగ్వీముక్తులఁదాముగన్న
లేమినగుకష్టమంతయు లెక్కఁగఁజేడు.

౬
౧౦౫౭. దూఱితెగడకయీనోపువారిఁగన్న
మోదమునఁ నెదలోలోనమురియునదగు.

౭
౧౦౫౮. యాచకులు లేమిఁగన్నమహాబ్ధిజగతి
బ్రూనిబోమమయేగివచ్చినమాదిరిదగు.

౮ ౧౦౫౯. ఇడెడివారలచోయశంబేమియుండు

నడిగిచేకొనువారులేనట్టిచోట.

౯ ౧౦౬౦. అర్థియిచ్చునాతనిఁగినియమివలయును

నెవ్వకస్తి తానయునుగణించుసాక్షి.
౧౦



౧౦౭-వ అ-ము - యాచనవెఱ.

౧౦౬౧. డాఁచకలరిమొసంగునేత్రసము లెడను

వేఁడికొనమిసుఖంబువేవేలపాళ్లు.
౧

౧౦౬౨.
అడిగికొనియుఁబ్రాణమువనునదివలసినఁ

దిరిగిచెడుతలోకమునువిధించినతఁడు. ౨

౧౦౬౩. లేమికడగండ్లయాదించినోముదమను

క్రౌర్యమునకంటెఁగ్రౌర్యంబుఁగలదిలేదు. ౩

౧౦౬౪. స్థలమశేషంబుఁగొననియాతగవుఁగలద

స్థలములేనప్డునడుగుటొందనినెరవది. ౪

౧౦౬౫. నీటివలెఁగాఁచుగంజేనిఁబాటువలన

నైనయదియానుకంటెలేదధికసుఖము. ౫

౧౦౬౬. ఆవునకునీళ్లుకావలెననియడిగిన

నాలుకకుయాచ్ఞలాగుహైన్యంబులేదు. ౬

౧౦౬౭. అడిగెదననడిగెడువారినంతనడఁగు

కడనుమటుఁగిడునలవారినడుగకుఁడని. ౭

౧౦౬౮. యాచనయనుదుర్బలనావదాఁచుటయను
నేలఁదగులునప్పుడుతానుజీలిపోను. ౮

౧౦౬౯.
యాచనఁదలంపఁగాహృదయముకరఁగును
దాఁచుటఁదలంపఁదీఱివదలుఁగలదియు.
౯

౧౦౭౦. దాఁచువారలకెచ్చోటదాఁగునోకొ-
యాచకాళికిలేదననరుగునుసుటు. ౧౦



౧౦౮-వ అ-ము_అల్పత్వము.

౧౦౭౧. పూరుషులనెపోల్చురితరుల్ వారిఁబోలు
పోల్చుటఁగలవారలను వేముగనలేదు.
౧

౧౦౭౨. లగ్గెఱుఁగువారికంటెఁదుల్లకులుసుఖులు

చిత్తమునవారుకష్టవర్జితులుగాన.

౨

౧౦౭౩.
దేవతలఁబోల్దురపశబ్దుల్ తృషఁగొనునది

వారివలెఁదామునొనరిచివర్తిలుటను.

౩

౧౦౭౪. చిత్తకృశతఁగలారిఁగాంచినను వారి

కంటెబలువుగజాల్ముఁడుగర్వమొందు.

౪

౧౦౭౫. సాధ్వసంబపామరులయాచారమితర

మాశయుండునేనిమఱుండులేశతరము.

౫

౧౦౭౬. క్వణితపటహాతుల్యులుపృథగ్జనులుదాము

వినినమఱుఁగునన్యులకెత్తివినుచుకతన.

౬

౧౦౭౭. తడిచేయివిదుల్పరితరులుదాలువడుచు
వడిచేయికలట్టిరుగనిలువనిజనులకు. ౭

౧౦౭౮. పలుకఁగఫలంబువడుదురుప్రాజ్ఞులించు
పగిదిగనొగుల్పనితరుఁడుఫలమువడును.

౮

౧౦౭౯. కట్టునదియుమెక్కనదియుఁగనిననీచుఁ
డట్టిరిమెడఁదప్పలుగనగట్టిఁడగును. ౯

౧౦౮౦. ఎందుకగుదురుస్వల్పులొం డెసఁగినప్పు
డమ్మనగుచురుదమ్ము వేగమ్ముగాను.

౧౦

త్రివర్గము - కామకాండము. 109

3 - వది -

కామకాండము—పరకీయాప్రకరణము.

౧౦౯ - వ అ

- ము - తగవువగఁబలుచుట.

౧౦౮౧.

అమరసుందరియొకొఱ వంచి నెమలియొకొఱ

విమలకుండలసతియొకొఱ భ్రమసెడుమది.

౧

౧౦౮౨. ఈమనోహరిచూపున కెదురుచూచు

ఓఁచు మోహిని వాహిని నెనసినటులు.

౨

౧౦౮౩. అపుడెఱుఁగమృత్యువను దానినిపుడెఱిఁగితి

సతిగుణమునొందు విపులాక్షిచక్షువులది. 3

౧౦౮౪. కన్నమనుజులయుసుజానఁగలపొడవునఁ

గన్నెతగవుముగుదచూడ్కికలది వేఱు. ౪

౧౦౮౫. మృత్యువో మఱి చక్షువో మృగియొ యెఱుఁగ
ముగ్ధకామినిదృష్టి యీమూఁడుఁగలది. ౫

౧౦౮౬. చెడుగుబొమలవక్రతఁజాటు సేసె నేని
వణఁకు తెగులొనర్పఁగ లేవు వనితకనులు. ౬

౧౦౮౭. ఘాతుకమదావళంబు పైకంటిపటము
భామినికుచాచలంబు పైపచ్చడంబు. ౭

౧౦౮౮. మెఱయునుదుటికినోఁగిలె నే మృధమున నెదు
రిడనిమగలును జడియు నాకడిమితనము. ౮

౧౦౮౯. మృగినెనయుభీతదృష్టియుహ్రీయుఁగనున
తివకుఁదొడనేలయొండగునవియమర్చి. ౯

౧౦౯౦. త్రాగినారలచోఁగాక కాఁగుమధువు
కాంచినారల రేఁపదు కామమటులు. ౧౦



౧౧౦-వ అ-ము - జాడనెఱుఁగుట.

౧౦౯౧. కనులనిరుచూపులింతికిఁగలవియొకఁడు

తెవులూనఁగుచూపొకండల తెవులుమందు.

౧

౧౦౯౨. చూపుముచ్చిమిఁగొను చిన్నిచూపధికము

కామమందు చెరిసగంబు కలది కాదు.

౨

౧౦౯౩. కాంచెఁగాంచిసిబ్బితిఁగాంచివంచెనుదల

నయ్యదా మెపంటకుఁబోసినట్టినీరు.

౩

౧౦౯౪. నేనుతనుఁగను నయ్యెడ నేలనుగనుఁ

దానుగనినగు మెల్లగఁగాననియెడ.

౪

౧౦౯౫. గుటెఁగొనికనుంగొనమికాక కొనకనుపడ

యొకకను మొగిడ్చినలదాని యోజనవ్వు.

౫

౧౦౯౬. అలతటస్థులటాడినఁదెలియఁగఁబడు

నలుకనొందనివారలపలుకులు వెస.

౬

౧౦౯౭. క్రుద్రహితకుత్సితోక్తులుం గ్రుద్ధులటుల
దృష్టియుఁదటస్థతుల్యసుహృదులగుటులు.

౭

౧౦౯౮. ఇంతికటఁగలదొక వేడ్క-యేనుజూడ
నంతఁగఱఁగినదయిచూఁదియల్లననగు.

౮

౧౦౯౯. వేఁబువారలగలినవిభేద మొందు
చూపుఁజూచుటయభికులచోనఁగలది.

౯

౧౧౦౦. కంటితోఁగంటిజతచూపుకలిసినసుఫ
లంబువాపల్కు-లెదియేనియుంబడయవు.

౧౦

అ - ము - కూడిక(గొనియాడుట.

౧౧౦౧.

కనియువినియుఁదాఁకియుమూరుకొనియుఁదినియు

నెఱుఁగువిషయులేనును నాతియెడనకలవి.

౧

౧౧౦౨. గదమునకుమందు పెఱస్వచ్ఛకటక చారు

తరుణితనరుక్కునకుమందుతానయగును.

౨

౧౧౦౩. తాము మోహించువారి మెత్తనిభుజముల

నానియానిద్రలాగింపొహరిజగంబు.

౩

౧౧౦౪. ఎడసినదహించుడగ్గఱు నెడనుజిల్లు

మను నెటగ్రహించెనిట్టిదౌనగ్గినీమె.

౪

౧౧౦౫. ఆశఁగొనినప్పుడవియవియటులనగును

చారుతరగంధమునకచసతిభుజములు.

౫

౧౧౦౬. ఎనయునపుడెల్లనుసుఖదినయఁడాఁకు

కతనసుధవల్లఁగలవిముగ్ధకుభుజములు.

౬

౧౧౦౭. తమమనికినుండితమయార్జితంబుపాళ్లు

కనమెసవినట్లుకోమరాలికాఁగిలింత.

౭

౧౧౦౮. లాలసులగునిద్దఱకునుల్లాసకరమ

గాలినడుమవ్రయ్యఁబడనికాఁగిలింపు.

౮

౧౧౦౯. అలుగునదిమానునదియంతఁగలినెడునది

యనునివియకాముకులుగన్నయాఫలంబు.

౯

౧౧౧౦. ఎఱుఁగునపుడెల్లనెఱుఁగమినెఱిఁగినటులు

కలియునప్పు డెల్లవలపది కామినికడ.

౧౮



౧౧౨-వ

అ.-ము.- మేలిమిమెచ్చిపలుకుట.

౧౧౧౧. ఓశిరీషమా సద్గుణీవౌదువు మేము

కోరునా మెనీకంటెను గోమలగుణ.

౧

౧౧౧౨. ననలఁగన్నను భ్రమసెదు మనసయా మె

కనులుపల్వురుగనుపువులెనయునను చు.

౨

౧౧౧౩. తలిరుతనువు ముత్తెములుదంతములు తావి

సురభికనులు శక్తియలమ సృఁగ భుజకను,

౩

౧౧౧౪. కనుటఁగల వేనితోఁగలిలఁగనుమ్రాలి

సురుచిరవిభూషకనులకుసరిఁగొనమని.

౪

౧౧౧౫. దిరిసెప్పుఁబువులుగాఁడలుదీయకావె

తుటిమెఁగనదిఁకఁగొనుశ్రీతూర్యములను.

౫

౧౧౧౬. చందమామనుసుదతియాస్యము నెఱుఁగక

యుండుతావునఁగలఁగెనాయుడుకులంబు.

౬

౧౧౧౭. విచ్చుపట్లనిండిన వెల్లువిధునకువలె

మచ్చయున్నెవక్త్రమునందుమానవతికి.

౭

౧౧౧౮. కాంత మోములాగుననీవుకాంతిఁజేయఁ

జాలుదేనిమోహింతుఁడాదుస్వస్తిచంద్ర.

౮

౧౧౯ కుసుమసమ నేత్రముఖ మొప్పంగోరు దేని
పలుపురును జూడను దయంబుఁబడకు చంద్ర. ౯

౧౧౨౦. దిరి సెనమునంచ తెలకఁ యుఁదీఁగ బోఁడి

పదములకున్నుంచుఁబల్లెరుపండ్లటు వైత. ౧౦.

113

త్రివర్గము - కామ కాండము.

౧౧౩

- వ. అ - ము - వలపుమిక్కుటమువాక్రుచ్చుట.

౧౧౨౧. పాలతోఁ దేనెకలిసినపగిదిదిమృదు
భాషిణీపాండురదసముద్భవజలంబు.

౧

౧౧౨౨.
తనువుతోఁ బ్రాణమున కేవిధంబులామటి

యతివతోమాకుఁగలప్రీతులావిధములు.

౨

౧౧౨౩. తారకఁగలపాపచనుమదరలియావు
మేమువలచుచారలికకుగీములేదు.

౩

౧౧౨౪. బ్రమకుటనుబోలునదికాంతప్రాణమునకు

మడియుటనుబోలునదిదానికెడయునపుడు. ౪

౧౧౨౫. తలఁతుభాసురజన్యనేత్రగుణములను

మఱతునేనినొకప్డునేమఱపెఱుఁగను.

౫

౧౧౨౬. కనులనరుగరుతెప్పవాల్చినవనరరు

తనుతరులుమదభీప్సితుల్ దానివలన.

౬

౧౧౨౭. కంటఁగలవారుహృద్యులాకారణమునఁ
గన్నులనుదీర్పనోల్లముగడచుటెఱిఁగి.

౭

౧౧౨౮. ఎడఁదఁగలవారుదయితులాహేతువుఁగొని

యుడుకఁదినభీతిలుదుము వారుడుకుటెఱిఁగి. ౮

౧౧౨౯. తెప్పవ్రాలినడోంగెడుచొప్పెఱుఁగుదు
నంతదాని కెవింతవారంధ్రుజనులు. ౯

౧౧౩౦. అలరియుందురు డెందమందనవరతము
నలిగియుందురువింతవారంధ్రుజనులు. ౧౦

15



౧౧౩౧-వ

౧౧౩౧. కామభోగానుషంగదుఃఖకలితులకు
క్షేమమీఁతాఁడుదకఁ-శక్తియది లేదు.
౧
౧౧౩౨. ఓరువనివిగ్రహమునసువులును దాటి
వారువము నెకఁ-cగొను ద్రపవదలి పెట్టి.
౨
౧౧౩౩. వ్రీడయును మేల్మగటిమియు నాఁడమరెను
నేఁడమరెఁగాముకులుగొను తాఁడునాకు. ౩
౧౧౩౪. కామమనుక్రూరసలిలముగన్న హ్రీను
శౌర్యమనునోడలనుగొనిచనుఁ దెరల్చి.
౪
౧౧౩౫. మాలికాచ్ఛకంకణయిచ్చెఁ దాళవాజి
తోడసాయమప్పుడునొచ్చుపీడనిపుడు. ౫
౧౧౩౬.
తాళహాయము నెకుఁ-టనిశీథముననుదల

పోయుచునిదురింపవుగనుల్ ముగుదకొ అను.

౬
౧౧౩౭. సింధునిభ కామమనుభవించియును దాళ
మెకకొనివధూటివిధము లే దెచ్చుఁగలది.

౭
౧౧౩౮. నిలుపరిది వారుషున కారుణికులు నాక
సమితిఁబడుఁగామమది గోపనముగఁతెంచి.

౮
౧౧౩౯. ఎటుఁగలే రేరుననియస్మదీయ కామ
మిరుగులో భ్రాంతివహియించితిరుగుచుండు.

౯
౧౧౪౦. ఏముగన్నులఁగనహాసియింతురుదమ
రేముపడ్డదిపడని మెయింగుమతులు. ౧౦

౧౧౫ - వ.

అ - ము - ఆడికోలెఱుఁగనిచ్చుట.

౧౧౪౧. అగడెగయదుర్లభంబగునసువులుండుఁ
దెలియరదిపల్కుపల్వురదృష్టమునను.

౧

౧౧౪౨.
సుమసమానలోచనయపూర్వము నెఱుఁగక
యొదవెనామెతోనగడునీయూరుమాకు.

౨

౧౧౪౩. తగులదోయూరుగన్నట్టియగడెడంద
కొనకయేదానిఁగొన్నట్టిగుణముఁగలది.

౩

౧౧౪౪. అగడువల్లనుగామంబునిగుడుటయ్యోఁ

గుదియునయ్యది లేకున్న గుణము వదలి.

౪

౧౧౪౫. కయిపుఁగనుదన్కఁ జానము ప్రియపడుగతి
బయలువడుదన్కఁ గామమింపయితనరెడు.

౫

౧౧౪౬. చూచినదియొకకఁ దివసంబు లేచెడుసడి
వ్యాళమది చంద్రమునిఁగొన్నవడువుఁగలది.

౬

౧౧౪౭. ఊరివారలదూఱు పెరువుగ జననిక
ఠోరభాషలు నీరుగ నీరుజయగు. ౭

౧౧౪౮. నేతినార్పదమగ్గినని యెడఁగలది
కామమార్పుద మెత్తునగడుననుట. ౮

౧౧౪౯. సడికిజంకుట యొప్ప నెజంకమని
నతఁడపల్పురుజంకి నెడ తెగినకడ.

౯

౧౧౫౦. తాముగోరిననిత్తు రాదయితు లేము

గోరునా అడి నెత్తునీయూరు దాన.



త్రివర్గము - కామ కాండము.

౨ - వది స్త్రీ యా ప్ర క ర ణ ము.

౧౧౬ - వ

అ - ము - ఎడఁబాటునకుడికిల్లుట.

౧౧౫౧. చనమికలదేని నాకయ్యదనుమునీదు
త్వరితగతిరాకజీవించువారికనుము.

౧

౧౧౫౨.
ఇతవుఁగలదియాయనచూడ్కి యొడయికంజు
జతువుఁగలదియాయెను నేడుసంగమంబు.

౨

౧౧౫౩. అరిదిసుమ తేఱుటెఱుకఁగలట్టివారి
యొడనునొకదారి నెడయికయ్యెడును గాన.

3

౧౧౫౪. ఘృణనభయమిచ్చినారలయొడసినమఱి
యలపలుకునమ్మినారలకగు నెతప్పు.

౪

౧౧౫౫. మనుపు దేని నేలినవారి చనమిమ్మనుపు
మటులవారు బాసినఁగూడుటరిదిపిదప.

౫

౧౧౫౬. ఎడయికవచించుకఠినులై రేనివారు
మఱలఁగరుణింతురనెడునక్కఱయరుదగు.

౬

౧౧౫౭. చెప్పవోక్కొఱ వేలపతిపాసినది నాకు
ముంగయద్దుమీ ఈడుక డెములకులములు.

౭

౧౧౫౮. క్రూరమిష్టభామలు లేనియూరమనుట
దానికంటెఁగ్రూరమభీష్టతమవిరహము.

౮

౧౧౫౯. కదిసినను గాలిచినఁగాల్చుఁగామురుజయ
వెడసినను గాలుపను జాలు నేయనలము.

౯

౧౧౬౦. అరిదిఁగొనిదుఃఖరుజఁబాపివిరహముఁగొని

యవలఁగొననుండిమనువారలవనిమెండు.

౧౦



౧౧౭ - వ

అ-ము - వంతచేఁజిక్కి-వందురుట.

౧౧౬౧. దాఁచుదేనామయంబునుదోఁచునూట

నీరులాగూరుఁజల్లెడువారలకిది.

౧

౧౧౬౨. దాఁచుటకును నేరువనీగదంబుగదముఁ

జేసినతనికాడను నాకుసిగ్గనిచ్చు.

౨

౧౧౬౩.

కామమునుశ్రీయానసువిహంగమకుఁదుదల

నోరువనినాదుతనువునందుండితూఁగు.

౩
౧౧౬౪. కామవారిధియదితానుగలదుదాని
నీఁదుకావలితరితాను లేదునాకు.

౪
౧౧౬౫. ద్వేషమున్నెడనేమికావింతురొక్కొ—
స్నేహమున్నెడబాధరాఁజేయువారు.

౫
౧౧౬౬. కామసుఖమువారిధిదానిఁగాంచునపుడు
కాఁచునపుడు వేదనదానికంటెనెచ్చు.

౬
౧౧౬౭. కామబహుళ్యోదకమునీఁదిగట్టుఁగాన
నేరనడిరాతిరిని నేననిలువఁగంటి. ౭

౧౧౬౮. కలనిఖిలజీవములనిద్రఁగనను జేసి
కుమతియగు రాత్రినను దకుఁగొనదుతోడు. ౮

౧౧౬౯. క్రౌర్యగులక్రౌర్యములకంటెక్రౌర్యములవి
యీరాతిధులమాసరములూందియేగు రేలు.

౯

౧౧౭౦. ఎదపగిదినుండుచోఁజనఁజదివెనేని

ఝరిఁగొనుజలంబులీఁదవస్మద్ధ్రశలిటు.

౧౦



౧౧౯ - వ అ

-ము - చూడికితొట్రునస్రుకొందుట. ౧౧౭౧.

కనులుదామేడ్చునదియేమొచననిగదముఁ

గనినదేమామొదటఁదాముగనఁబఅుపఁగ.

౧౧౧౭౨. అరసితెలియకచూచినయంజనాక్షు

లూలసితెలియకవేదననొందుశేల.

౨

౧౧౭3. పదటముగఁదాముగనితామపరితపించు

నిదికలదియేముపరిహాసమిడుతగవును.

3 ౧౧౭౪. ధారచెడిసీరనెండెనేత్రములుమనని

దారిఁచుదలేనిరుకుఁ-నాతట్టునిలిపి.

౪

౧౧౭౫. నిమిషహీనవేదనఁగుందునీరధికిని

సమము లేనికామగదంబొసఁగినకనులు.

౬

౧౧౭౬. అహహహృద్యమెమాకిట్టియామయంబు

నిడినచక్షువులీవంతయొడఁబడినది.

౭

౧౧౭౭. వనరివనరిలోనిజలంబువట్టుతఁబ్రియు

వలచికరఁగియాసగఁగన్నయలకనులిట.

౮

౧౧౭౮. వలవకయవలచినవారుగలరిటమఱి

కనులునిమిషముఁగనలేవుకనకవారి.

౯

౧౧౭౯. రానియఘమఁదూఁగవువచ్చెనేనిఁదూఁగ

వావగలనునాచుకనుల్ ఘనార్తిఁగలవి.

౧౦

౧౧౮౦. అరిదికాదూరుకొంటరహస్యముమము

నెనయురావానకాౘ్రుులయెడఁదనుండి.

౧౦



౧౧౯ - వ

అ - ము - పాండిమకలిమిఁబరితపించుట.

౧౧౮౧. వల్లభులకునీయమినోడఁబడితినేరి

కంధునిపుడుపాండిమవతినయినప్రకృతి.

౧

౧౧౮౨. వారోసంగినారనువ్యవహారముఁగాని

పాండిమంబునామెయిపయిఁబర్వియూరు.

౨

౧౧౮౩. చెలువమునునాయునువారుచేకొనిరిప్ర

తిగగదముఁబాండిమమునాకొసఁగియలతటి; 3

౧౧౮౪. తలఁతునేనుజెప్పనదివారలయలగరి

మమటుచేయుచుండియునుబాండిమకవుడగు. ౪

౧౧౮౫. అటుగదామదభీప్సితులరుగుచుందు

రిటుగదా మెయిఁబాండిమ మెదుగు నాకు. ౫

౧౧౮౬. దివ్యయతటేఁజూచుతమంబుతీరునఁబ్రియు

మచ్చికతటేఁజూచునుబాండిమంబుచేర. ౬

౧౧౮౭. కౌఁగిలించియుండితెఁబ్రకట గాఁబొరలితెఁ

బాండిమంబువచ్చె వెరంజుపగిదినంత. ౭

౧౧౮౮. పాండిమమునీమెక నెననుపలుకుగాని

వారెడసిరీమెననిరెుడువారు లేరు. ౮

౧౧౮౯. పాండిమమునామెయిన్వలెఁబడినటునయ

మానిచినవారుసుస్థితులౌదు రేని.

౯

౧౧౯౦. పాండిమయటంచు పేరౌటభద్రమనయ

మానిచినయట్టిరీమిదూఱాడ రేని.

౦౧



౧౨౦ - వ

అ - ము - పాక్షికామనస్యముపలుకరించుట.

౧ ౧౯౧.

తమప్రియులుదమ్ముఁబ్రియపడఁదనరినారు

పడసిరిసుఖంబనెడునయఫలముఁగుడుఁవ.

౧ ౧౧౯౨.

మనెడుజనులక భ్రమగురిసినవిధంబు

ప్రియులకలప్రియుల్ గనిసలిపెడుప్రియంబు.

౨

౧౧౯౩ .

వలపుఁగలవారిచేవలవఁబడువారి

కమరుసుఖమానికాఁగలమనుప్రమదము.

౩ ౧౧౯౪. వలవఁబడువారుభాగ్యవికలలుదాము

వలవఁగలవారిచేవలవఁబడరేని.

౪

౧౧౯౫. మనవలపుఁగాంచినారలుమనకునేమి

సలుపుదురొ తామునాగతివలవనికడ. ౫

౧౧౯౬. ఏకపక్షకామముచెట్టయింపుఁగలది

భారయష్టిలాగున రెండుపక్షములది. ౬

౧౧౯౭. గదమునామనస్యంబునుగానఁడొకొక్కఁ—
డొకరిచోనకందర్పకుఁడుండినడచు. ౭

౧౧౯౮. ప్రియులవలనిప్రియోక్తిఁబడయకజగతి
బ్రతుకమదితలకంటెఁగర్కశులులేరు. ౮

౧౧౯౯. హృద్యమ్ములీయరేనియువారియెడనగుపలు
కెద్దియేనిపీనులకిష్టమియ్యఁగలది. ౯

౧౨౦౦. కొననివారికిఁగొనువెతవినిచెదీవు
గడలిఁబూడ్చుముమనసమంగళమునీకు. ౧౦



౧౨౧-వ అ-ము-

తలఁచినవారుపలవరించుట. ౧౨౦౧.

తలఁచినసుదొలంగనిపెన్ముదంబునిచ్చు
కతననగుఁబరిస్రుతకన్నకామమింపు.

౧ ౧౨౦౨. కామమెటుసుఖమొండసోతాముపలచు
వారిఁదలఁపఁగనొండులేదారెడునది.

౨ ౧౨౦౩. తలఁచువారినిబోలుచుఁదలఁపరొకొక్కఁ
కలుగుదానినిబోలుచుఁగలఁగుఁదుమ్ము.

౩ ౧౨౦౪. మేమునుంగలమొకొవారియామనమున

మామనంబుననలవారమరిగికలరు.
౪ ౧౨౦౪. వారియెదఁగాఁపుమముఁగొన్నవారుసిగ్గుఁ
గానరాకొమాయెదఁదొఱంగకచనుదేర.
౫ ౧౨౦౫. ఏనుమఱిమెదికొనినిల్తునేనువారి
తోనుగలిసినతిథులెంచఁగానిలుతును.
౬ ౧౨౦౬. మఱచినమతెందుకగుదునేమఱపెఱుఁగను
దలఁచినఁదహించుఁదలఁపునాతనియెడయిక.
౭
౧౨౦౭. ఎంతతలఁచిననలుగలేరంతకాదొ
వల్లభులుదనరిచెడియావైభవంబు.
౮ ౧౨౦౮.
తరలునామేల్మియుసుఱుభేదవిరహితుల
మనెడియావారిదయలేమినధికమెంచి.
౯
౧౨౧౦. వీడకేగినవారిమద్వీక్షణములఁ
జూడనేగకుమీవుమంచుజిగికాఁడ.

౧౦ 16



౧౨౨-వ అ-ము-
కన్నకలయునికినెన్నియాడుట. ౧౨౧౧.

వల్లభులదూత్యమునుబూనివచ్చినదగు
స్వప్నమునకేదియొకో నేనుసల్పువిందు.

౧ ౧౨౧౨. తొగలచూపులు నే వేఁడఁదూఁగు నేని
బ్రదుకుభావము నే నేయనుదుఁబ్రియులకు.

౨ ౧౨౧౩. జాగరనునీనివారలస్వప్నమునను
గాంచుటను నాకుఁబ్రాణముగలదియగును.

౩ ౧౨౧౪. కలనుగామముగలుగును మెలపునందొ
సఁగనివారలనరసియొసంగుకతన.

౪ ౧౨౧౫. మెలఁకువనుగన్నదియునష్టకలయదియును
గనినపుడయింపౌనరె రెండుఁగనుకసమము.

౫ ౧౨౧౬. జాగరూకతయననొండుసంభవింప
దేనిపాయరుగలయందుహృద్యులునను.

౬ ౧౨౧౭. జాగరూకతనీయనిజరులుగల
లోనవేదనసేయునదేనియమము.

౭ ౧౨౧౮. తూఁగుకడదోర్గతులయితూఁగేగుకడను
వేగమునస్వాంతగతులుగావిలసిలుదురు.

౮ ౧౨౧౯. మెలపుననొసంగకుండువారలనొడుతురు
గలమొడఁగనంగలేనివారలుదయితుల.

౯ ౧౨౨౦. మెలపునను బాసిరంద్రుమమ్ములదయితులు

గలయెడను గానరాకొం-యిక్కడఁగలారు.

౧౦



౧౨౩ - వ అ - ము -

ప్రొద్దుపొడగనిపొగులుట.

౧౨౨౧.

సాయమోకావుపరిణీతసతులయుసుఱుఁ
ద్రాగు నా వేళవగుదీవొదలుము ప్రొద్ద.

౧

౧౨౨౨.

స్వస్తిభ్రమయుతసంధ్యసూక్ష్మపుమదీయ
హృద్వ్యగతికరిను ండొనీప్రియతము ండు.

౨

౧౨౨౩.

చలువపొడమిచీకటఁగాం చుసంజయిపుడు
విసుగుపొడమి వేదన హెచ్చముసురుచుండు.

౩

౧౨౨౪. వల్లభులు లేనియిపుడుదివసవిగమము

సంహారణభూమియహితులజూడవచ్చు.

౪

౧౨౨౫. ప్రత్యూషమునకేఁ జేసినబాగెదియొకో
సంధ్యకెదియొకో చేసినశాత్రవంబు.

౫

౧౨౨౬.
సాయమువేతంబఱచుటనానాయకులెడఁ
బాయనియలప్పుడెఱుఁగనేపాటిదియును.

౬

౧౨౨౭. కల్యమందుజనించియాఘస్రమంత
కుత్సలంబయిసంధ్యనీగోడుప్రాచు.

౭

౧౨౨౮. అగ్నినొప్పుసంధ్యకుమాతయైహరించు
శస్త్రమయ్యెవల్లవువేణుసంరవంబు.

౮

౧౨౨౯.
తలముభ్రమసికుందుఁబఁడుస్వాంతంబుభ్రమసి
దివసవిగమమల్లుకొను నాదిష్టమునను.

౯

౧౨౩౦. ధనమనోరథయుతులనేతలఁచిభ్రమయు

దినసమాప్తినిదెగును నా తెగనియుసులు.

౧౦



౧౨౪ - వ అ - ము -

అవయవములరొుజపవియుట.

౧౨౩౧. ఎగ్గుమనపాలనూడదవ్వేగినారి
నెంచిత్రపఁగాంచెఁబూవులకీక్షణములు.

౧

౧౨౩౨. వల్లభులాఁసంగమినినాడువానినొప్పఁ
బాండిమవహించినుజినీరుపర్వకనులు.

౨

౧౨౩౩. పాసినదిమెండుతెల్పెఁశుభాతిఁగొనువి
వాహమయినప్పుడుబ్బినబాహులతలు.

౩

౧౨౩౪. బెడఁగుఁబాసిపచ్చనిమంచికడెము లెడలుఁ
బ్రియులఁబాసితొల్లిటిచెల్వువిడినకయులు.

౪

౧౨౩౫. కఠినులకఠోరతనుబలుఁగలవియయ్యెఁ

గడియములతోడఁదొలిచెన్ను చెడినకయులు. ౫

౧౨౩౬. కంకణములూడుగతిఁగేలుకార్శ్యముఁగొన
నొచ్చుటకఠోరులనివారినుడువనొచ్చి.

౬

౧౨౩౭. గారవముఁగందొహృదయమాకఠినులకుమ
దీయమగుస్రుకుఁకయులయార్పెలుఁగఁబలిఁ.

౭

౧౨౩౮. కౌఁగిలించినకరములఁగడపనంతఁ
గాంచెఁబాండిమరువిరముగ్ధనిటలంబు.

౮

౧౨౩౯. కౌఁగిలింపునఁజల్లనిగాలిప్రయ్యెఁ
బాండిమంగనెముగ్ధబల్వర్ణదృష్టి.

౯

౧౨౪౦. దృష్టిపాండిమయొవ్యథాధీనమయ్యె
చెన్నుమీఱినగోధిచేసినదిచూచి.

౧౦

౧౨౫ - వ అ - ము - మనసుతో మందలించుట.

౧౨౪౧. తలఁచియొుండునీవనుముచిత్తమయ్యెదేని
తెలిసియొుండుఁదీఱని తెవుల్ దీర్చుమందు.

౧

౧౨౪౨. వలపువారుపొందకయుండువారు కాఁగ
మనసనీవునొచ్చుట తెల్విఁగనమిస్వస్తి.

౨

౧౨౪౩. ఉండితలఁచి వేఁగునదియేదో మనసక
రంగితలఁచుటేఁపిడినవార లెడలేదు.

౩

౧౨౪౪.
దృక్కులనుగూడఁగొనిపొమ్ముహృదయమయివి
మెక్కనను వారిఁగనుగొంటకక్కఱఁబడి.

౪

౧౨౪౫. అనభిలాషులైరనివిడనాడుటగు నె
మనస మేముగోరఁగనుగోరనిదయితుల.

౫

౧౨౪౬. కలిసివిడఁజేయుహృద్యులఁగన్నమనస
యలిగివిడలేవుదొంగదూఱాడెదీవు.

౬

౧౨౪౭. కామమొండెహ్రీయొండెపోఁగడపుమంచి
మానసంబయీరెండునేఁబూనలేను.

౭

౧౨౪౮. అక్కఱపడియీయరువారలనుచుస్రుక్కి
యజ్ఞమవెనపాసినవారినంటిచనెదు.

౮

౧౨౪౯. చిత్తముననుండువారభీప్సితులుకాఁగ
నెంచిచనుచుందునామదియేరికడకు.

౯

౧౨౫౦. కలయకెడసినవారిహృత్స్థలినిగలము
చెలువిఁకనునెడఁబాయనిచ్ఛేదముమేము.

౧౦

నిలుపుతనముపోలివోవుట.

౧౨౫౧. వలపనియెడుశంకులయది వ్రయ్యఁగలదు
నిలుపనియెడునర్గళముఁజొనిపినతలుపు.
౧

౧౨౫౨. కామమనఁబడునొకఁడనుకంపఁగనదు
నామదినిబనిఁగొనునలనడికి రేను.
౨

౧౨౫౩. దాఁచఁదలఁతుఁగామము నేనుదలఁపులేక
తోఁచివిడుచు దాఁగకలోనఁదుమ్ముమాడ్కి.
౩

౧౨౫౪. నేనిలుపుఁగంచునను చునుంటిమఱినాదు
కామమురహస్యమెడలిసంఘమునఁబడును.
౪

౧౨౫౫. ద్వేషితులవెన్కఁజనని పెద్ద బేరిమియల
కామగదయుక్తులెఱుఁగునొక్కండుగాదు.
౫

౧౨౫౬. ద్వేషితులవెన్కఁబోకనర్థించునన్నుఁ
గూడినవిపత్తిమోహము యేగుణముకలది.
౬

౧౨౫౭.
ప్రీఁయనునొకండుమాత్ర మొయెఱుఁగలేము
కామమునహృద్యులాసలుగలవిసలుప.
౭

౧౨౫౮. నైకమాయలముచ్చువినయపునుడులు
గాదెమాపెనుస్త్రీత్వముగల్చుదండు.
౮

౧౨౫౯. అలుగుదునునాఁగనరిగితినరిగియుమది
కలయికనుబూనుటనుగనికలిసితినట.
౯

౧౨౬౦. వపశిఖనిడినదెనయుతలఁపుఁగలారి
కలిగినిలుతముకలియఁగనసుటకలదె.
౧౦

త్రివర్గము - కామకాండము. 127

అ - ము - ఒండొరులుత్తలపడుట.

౧౨౬౧. కనులురుచిచెడియింతలైతనరెవారు
చనినదినములనంటితేసినవివ్రేళ్లు.

౧

౧౨౬౨. రుచిరభూషయీదినముమఱచినమీఁదుఁ
గడెములెడలునాభుజములుబెడఁగుపాయ.

౨

౧౨౬౩. శౌర్యతృషమదితోడుగఁజన్నవారి
రాకతృషఁగలనేఁజనిపోకయిఁకను.

౩ ౧౨౬౪. భరితకామాప్తిఁబాసినవారురాను
దలఁచిశాఖాళిఁగొంచుమత్స్వాంతమెకుట.

౪

౧౨౬౫. కనని! నాయకుఁగనులారఁగన్నపిదపఁ
బఱచునామృదుభుజపాళిపాండిమంబు.

౫

౧౨౬౬. రాని! విభుఁడొకనాటికినానుదునిపు
డేఁచివెతలిడురోగములెల్లఁజెడను.

౬

౧౨౬౭. అలుగుదునొక్కొఁగిలింతునొకలియుదునొన

యనమెనయునామువిందువచ్చినను నేను.

౭
౧౨౭౮. పనిఁగలసి గెల్చుఁగాతమవనివిభుండు

సతిఁగలసివిందుఁగూర్తముసాయమునకు.

౮ ౧౨౭౯. ఏకతిథిసప్తతిథులుదవ్వేగినవిభు

రాకతిథినుంచివగచెడురామలకగు.

౯

౧౨౮౦. కనఁగలిగియేమికనియేమికలిసియేమి
యెదపగిలిపాయుటకుఁగానుదుదిఁగొనినట. ౧౦



౧౨౮ - వ అ - ము - జాడఁగననిచ్చుట.

౧౨౮౧. దాఁచినను సమ్మతిలకచేదాఁటినీదు

నేత్రములెసెప్పఁగలదియుండెడునొకండు. ౧

౧౨౭౨. కనులునిండినరుచిరముగ్ధవనితల
కడనునిండినగుణమధికతనుగలది.

౨

౧౨౭౩. మణులకడఁబ్రకాశించెడుగుణమనసతి
మొఱపుకడఁబ్రకాశించునదొండుకలదు.

౩

౧౨౭౪. మొగడమోడ్పులోనిదగుతావిగతిముగుద
నగవుమోడ్పులోనిదగునొండుగుటికలదు.

౪

౧౨౭౫. క్వణితకంకణసలిపితాఁజనినకిటుక

దొలయునంగదఁగడపుమందొండుఁగాంచు. ౫

౧౨౭౬. కడునమర్చిహర్షముఁగొనఁగలియుటరిది
గనుసహించియప్రియతనెంచునదికాంచు.

౬ ౧౨౭౭. జిల్లొలయువేలభర్తపాసినయదిమన
కిన్నమునుపేయెఱింగెనీకంకణములు.

౭

౧౨౭౮. ఎడసిరలమాప్రియులునిన్ననేమునేడు

దివసములవారలము మేనితీరుమాసి.

౧౨౭౯.

కటకములఁగాంచిభుజములఁగాంచిమొఱియుఁ

జరణములఁగాంచియటనదిసలిపినదది.

౧౨౮౦. స్త్రీత్వమునస్త్రీత్వమునుగలదియగునం

ద్రుఁ

నేత్రమునఁగామగదమునెన్నియడుగుటను. ౧౦



త్రివర్గము - కామకాండము.

౧౨౯ - వ అ - ము -

కలియికకుఁదలపడుట.

౧౨౮౧.

తలఁపమోందించుటయుఁజూడనలరుటయును

గలదుకామంబునకు లేదుకశ్యమునకు.

౧ ౧౨౮౨.

నూవుమితియుఁగోపపడమి కావలయును
రేవుమితియుఁగామముప్రసరించు నేని.

౨

౧౨౮౩. గణన సేయక తృషితములూనరిచినను
విభుని గానక యమరవువీక్షణములు.

౩

౧౨౮౪. అలుగుటందపోయితిఁ జెలియద్దిమఱవి
కలియుటందపోయెనుమదికన్నపిదప.

౪

౧౨౮౫.
వ్రాయుచోఁదూలిఁగనని నేత్రంబుమాడిౘ
నాథుచో నేవఁగననుగన్నకడ నేను.

౫

౧౨౮౬. కనెడికడఁగాన లేనుదప్పానరినయవి

కననికడఁగాన లేనుదప్పొనరనియవి.

౬

౧౨౮౭. తినుచు నెటిఁగినీటఁదిగు వారిగతిబొంకు
పలుట నెటిఁగియేమిటికిఁగోపగిల నేను.

౭

౧౨౮౮. హైన్యమిచ్చునప్రియములీయఁగలదేని

నీయురంబుహృష్టలకిరానిభముధూర్త.

౮

౧౨౮౯. పువునకన్న మెత్తనకామమువుఁదదీయ

గుణముసంతరించెడువారుగొందఱుర్వి.

౯

౧౨౯౦. కంటఁగనలికలంగె నాకంటఁదాను

కామకాండము.

౧౩౦-వ అ-ము-మనసుతోఁగనలుట.

౧౨౯౧. వారిమనసువారికిఁగానువఱలఁగనియు
నీవుమనసయేటికిమాకునిల్వనిదటు.

౧౨౯౨. అభిలషింపనివారిఁగన్నపుడుమనస
కినియరంచునువారిచోఁగిట్టెదీవు.

౧౨౯౩. చెడినవారికిసఖులేరుపడరనునదొ
మనసకోరినగతివారివెనుకఁజనుట.

౧౨౯౪. ఇంకనట్టివినీతోడనెంచువార

లెవ్వారుల్లమయాంభిలమిడికలయవు.

౧౨౯౫. పడయమికిభయపడుభయపడఁబడసిన
నెడయికకు నెడయనిదగునిడుమదిమది.
౫

౧౨౯౬. ఒంటిపడియుండితలఁప నాయుల్లమిచట
నుండినదినన్నుఁదినెడులాగోగుఁబఱుప.
౬

౧౨౯౭. త్రపయదియు నేమఱచితివారలమఱచుటఁ
గననిదగు నాదమహితముగ్ధమతిఁగూడి.
౭

౧౨౯౮. తెగడినను హైన్యమగుననివగచివారి
వగనెతలపోయునసుతృషావహహృదయము. ౮

౧౨౯౯. కాఱియకు నెవ్వరేతోడు కాఁగలారు
డాముగలయుల్ల మేతోడుతారనిగటి.
౯

౧౩౦౦. కఱ వెఱొకరులుబంధువుల్ గామి తాము
కలుగునలఱొదబంధువుగానియపుడు.
౧౦

౧

౨

౩

౪



౧౩౧-వ అ-ము - పొలయలుకపొరయుట.

౧౩౦౧. కవుఁగిలింపకుండుముగిన్కఁగనుమువారు
కనెడుదుఃఖరుక్కునొకింతకనుద మేము.

౧ ౧౩౦౨. ఉప్పమరినట్టులలుకయాయుప్పుకొంత
మిక్కిలయినట్టునిడుదయౌ మెయివిడుచుట.

౨ ౧౩౦౩. అలమరినయట్టివారి మెండలఁచినటులు
దమునలిగినట్టివారిఁబొందక విడుచుట.

౩ ౧౩౦౪. అలిగినట్టివారలఁదీర్చి కలియమితడి
తొలఁగిచెడ్డతీఁగియ వేరుఁద్రుంచినటులు.
౪ ౧౩౦౫. సరసనియమసాధువులకుంజారుతరము
కలహానియమమాకమలనేత్రలమనసున.
౫ ౧౩౦౬. యాతనయునలయుంగల్గదయ్యెనేని
కామమదిపండునుంబచ్చికాయఁబోలు.
౬ ౧౩౦౭.
అలుకయగుచోనుగలదొకయంగదయుఁకఁ
గలియునదిదీర్ఘమగునదికాదొకొయని.
౭ ౧౩౦౮.
నొచ్చుటలనొచ్చిరినాఁగనొప్పినెఱుఁగు
నట్టిప్రీతిమంతులులేనియట్టిచోట.
౮ ౧౩౦౯. సలిలమునునీడకడదియేసౌఖ్యకరము
కలహమునుబ్రీతిపరులచక్కఁటినసుఖము.
౯ ౧౩౧౦. తానలుకవేఁగవిడువారితో నెనాదు
మానసముహాదము నాఁగమలయుటాస.
౧౦

౧౩౨-వ అ-ము-అలుకజిలుఁగువలుకుట.

౧౩౧౧. స్త్రీప్రకృతులేరునశ్రులచేసమముగ
నానుదురునేనుబొందనీయనుకఁషిద్గ.

౧

౧౩౧౨. అలిగియేముండఁగాఁదుమ్మిరపుడువారిఁ
జిరముగానుండుఁడీరంచుచెప్పటెఱిఁగి.

౨

౧౩౧౩. దండయగుపూలఁదుఱిమినఁదానుగినియు
నొకఁతకుఁజూపఁదుఱిమితిరో యనునుచు.

౩

౧౩౧౪. పరికంటెఁబ్రీతులమంటినేరికంటె
నేరికంటెనాయనియలకఁనెనసెఁదాను.

౪

౧౩౧౫. ఇహసముద్భవమందుమేమెడయమంటి
మొలుకఁగన్నులనిండనశ్రులఁగొనియెను.

౫

౧౩౧౬. తలఁచితినటంటినటననుఁగలియదయ్యె
నలుకఁగొనినన్నుమఱచితిరనుచుఁదాను.

౬

౧౩౧౭. స్వస్తియనెఁదుమ్మనంతలోవగచెఁజెలువ
యెవ్వరుతలంచితుమ్మితిరీరటంచు.
౭
౧౩౧౮. తుమ్ముఁదాఁపఁగమీవారుమిమ్ముఁదలఁప
మమ్ముఁదాఁచితిరోనాఁగఁగ్రమ్మనేడ్చె.
౮
౧౩౧౯. తమ్ముఁదెలిపిననలుగునుదా మొరులకు
నిట్టిగుణమునుగలుగువారేకదయని.
౯
౧౩౨౦. తలఁచియుండివీక్షించిననలుగుసకల
మెవరినెంచివీక్షించితిరీరటంచు.
౧౦

## త్రివర్గము - కామకాండము.



### ౧౩౩ - వ అ - ము - అలుకవలననలరుట.

౧౩౨౧. వారియెడఁదప్పులేకున్నవారుకరుణ

చేయుగతిగట్టిదానల్క- సేఁతఁజేయ.

౧ ౧౩౨౨. అలుకఁదోఁచెడుచిఱువెతవలనమంచి
కరుణవాడినఁబడయును గారవంబు.

౨ ౧౩౨౩. అలుగుటొప్పు వేల్పులనాడుఁగలదొనేల
వలననొప్పనీరముఁబోలువారలయెడ.

౩ ౧౩౨౪. కవుఁగిలింపుడుగమిఁజేయుకలహమందు
పొడముమద్హృదయముఁజీల్చుపోటుముట్టు.

౪ ౧౩౨౫. అనపరాధులైననుదమయనుఁగుఁజెలుల
మృదులదోషలానమినిగలదటులోకఁడు.

౫ ౧౩౨౬. తినుటకంటెఁదిన్నదిముందు తెగుటయింపు
కలపుకంటెనల్గుటయింపుకామమునకు.

౬ ౧౩౨౭. అలుగుటందుఁబరాజితుల్ గెలిచినట్టి
రదికనంబడుఁగూడికయందుఁబిదప.

౭ ౧౩౨౮. అలిగికందమొకోనొసలదిచెమర్ప
కలయికంగనఁదోఁచినయలరసంబు.

౮ ౧౩౨౯. అలుగఁగాకభూషావిలాసాంగదీర్ఘ
మగునుగాకయీరేయిమేమడిగివేఁడ.

౯

౧౩౩౦. అలుగుటింపుకామమునకాయలుకకింపు

కలిసియంతఁగొఁగిలిఁగొనఁగలుగు నేని.

౧౦

---

సంపూర్ణము.




త్రివర్గము.

---

కాండప్రకరణాదులు.

ధర్మకాండము.

{ ప్రవృత్తి ప్రకరణము అధ్యాయములు ౨౪
{ నివృత్తి ప్రకరణము ,, ౧౪

అర్థకాండము. { రాజ్య ప్రకరణము
అంగ ప్రకరణము
శేష ప్రకరణము.

కామకాండము. { పరకీయా ప్రకరణము
స్వకీయా ప్రకరణము

వెరసి

---

అధ్యాయములు.

౨౫

అంతర్వైరము

అక్రోధము

అజ్ఞత

అతిథినత్కారము

అనర్హ వర్తనము

అనర్హ సఖ్యము

అనిష్టాకరణము

అభిధ్యారాహిత్యము

అలసతలేమి

ఫుటసంఖ్య.

ఫుటసంఖ్య.

